వార్త

ఆదివారం

19 మార్చి 2017

# హృద్రోగుల హెల్త్ అసి 'స్టెంట్'!

# కొత్త లుక్ ఎలా ఉంటుందో!





యంగ్ టైగర్ ఎన్టీఆర్ తన కొత్త సినిమా షూటింగ్‌లో ఈనెల 15 నుంచి పాల్గొనబోతున్నారు. డైరెక్టర్ బాబీ డైరెక్షన్‌లో తెరకెక్కే జై లవకుశ వర్కింగ్ టైటిల్ చిత్రంలో యంగ్ టైగర్ మూడు విభిన్న పాత్రల్లో కన్పించనున్నారు.. అయితే ఈ చిత్రం షూటింగ్ మొదలైనప్పటికీ ఎన్టీఆర్ ఇంతవరకు ఈ షూటింగ్‌లో జాయిన్ కాలేదు.. జనతా గ్యారేజ్ చిత్రం తర్వాత లాంగ్ గ్యాప్ వచ్చేసింది.. ఎన్టీఆర్‌కి మరో చిత్రం చేయటానికి తన బరువు తగ్గించుకుని జుత్తు పెంచుకుంటున్నారట.. అపుడే ఎన్టీఆర్ లుక్‌పై సోషల్ మీడియాలో జోరుగా ప్రచారం సాగుతోంది. ఈ చిత్రం ఫస్ట్ లుక్‌ని ఎన్టీఆర్ బర్త్‌డే సందర్భంగా మే 20న విడుదల చేయాలనే ప్లాన్‌లో ఉన్నారట.. మంచి స్టైలిష్ లుక్‌తో ఎన్టీఆర్‌ను చూపించాలని అంటున్నారట.

# మరో ఛాన్స్



త్రిపుర చిత్రంలో స్వాతిని చూసి తెలుగు ప్రేక్షకులు మర్చిపోలేరు. ఇపుడు తమిళ మూవీ 'అండవన్ కాట్టలై'కి రీమేక్‌లో హీరోయిన్‌గా చేస్తోంది. 'కాజా ముట్టై' తో కోలీవుడ్‌లో ఎంట్రీ ఇచ్చిన మణి కందన్ రూపొందించిన 'అండవన్ కాట్టలై' బ్రోకర్ల దందా నేపథ్యంలో సాగే ఈచిత్రంలో రితికా సింగ్ లాంటి కొత్త హీరోయిన్ పాత్రను స్వాతి చేయబోతోంది.

# సోకుల కుమ్మరింత!

పూరీ జగన్నాథ్ దర్శకత్వంలో రూపొందిన రోగ్ ఆడియో వేడుక హైదరాబాద్‌లో అంగరంగ వైభవంగా నిర్వహించిన విషయం విదితమే.. పూరీ తన మైండ్ అండ్ సోల్ మొత్తం పెట్టి మరీ రోగ్‌ను పూర్తి చేశారు. తాజాగా జరిగిన ఆడియో వేడుకలో ఆశించినట్టుగానే సన్నీలియోన్ డ్యాన్స్ షో ప్రత్యేక ఆకర్షణగా నిలిచింది.. భారీగా రెమ్యూనరేషన్ పుచ్చుకున్న సన్నీ అందుకు తగ్గట్టుగానే తగిన న్యాయం చేసిందని అంటున్నారు.. అందాల ఆరబోతలో సన్నీ స్టైల్ ఏంటో స్పెషల్‌గా చూపించిన ఈ బ్యూటీ ఒకటే షో అయినా.. మూడు రకాల డ్రస్సులు మార్చి ఇరగదీసింది.. మొత్తానికి సన్నీలియోన్‌తో స్పెషల్ డ్యాన్స్‌షో చేయించాలన్న దర్శకుడు పూరీ ఆలోచన మాత్రం సూపర్ డూపర్ హిట్ అంటున్నారు.

## తారాతీరం

పవన్ కల్యాణ్ -త్రివిక్రమ్ శ్రీనివాస్‌ల కాంబినేషన్ అంటే భారీ అంచనాలతో పాటు ఖచ్చితంగా హిట్ అనే ఒక నమ్మకం ప్రేక్షకుల్లో ఉంది.. త్రివిక్రమ్ కూడా ఆ అంచనాలకు తగ్గట్టే పవన్ కల్యాణ్‌ను ఎప్పటికపుడు సరికొత్తగా చూపిస్తూ ఫ్యాన్స్‌ను ఖుషీ చేస్తుంటారు.. వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన మొదటి చిత్రం జల్సాలో పవన్‌ను ఒక స్టూడెంట్‌గా నక్సలైట్‌గా చూపించి, రెండో సినిమా అత్తారింటికి దారేది..లో కాస్త లెవల్ చూపించే ధనవంతుడిగా చూపించిన త్రివిక్రమ్– త్వరలో మొదలు కాబోతున్న కొత్త చిత్రంలో సైతం సరికొత్తగా చూపించనున్నారట. సినీవర్గాల సమాచారంబట్టి ఈ చిత్రంలో పవన్ ఒక సాఫ్ట్‌వేర్ ప్రొఫెషనల్‌గా దర్శన మివ్వనున్నారట.. ఇందుకోసం ఇప్పటికే రామోజీ ఫిల్మ్ సిటీలో ఒక సాఫ్ట్‌వేర్ ఆఫీస్ సెట్ కూడ వేయిస్తున్నారట.. కాటమరాయుడు చిత్రీకరణ ముగించగానే, ఈ సినిమా మొదలవుతుందని తెలుస్తోంది..

కె.సురేష్ బాబు

ఆదివారం వార్త
19 మార్చి 2017

## విషయ విశేషం



### మంచి ముత్యాలు

వయసుకి, వృద్ధాప్యానికి సంబంధం లేదు.
కొంతమంది జన్మతః వృద్ధులు.
కొందరు నిత్య యువకులు.
-ట్రామాన్ ఎడ్వర్డ్స్




## భావ వీచిక



### ఓడిన న్యాయం..ధర్మం!

మరోసారి ప్రజాస్వామ్యం పరిహాస మాత్రంగా పరిణమించింది. అవును.. మణిపూర్ అసెంబ్లీ ఎన్నికల ఫలితాలను చూసినప్పుడు విచక్షణ ఉన్న ఎవరికైనా ఇదే ఫీలింగ్ కలుగుతుంది. మణిపూర్ ఉక్కు మహిళగా చరిత్ర సృష్టించిన ఇరోమ్ షర్మిల.. ప్రజల పక్షాన నిలబడి, అక్కడి సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం తొలగింపుకు ఒకటి కాదు, రెండు కాదు 16 ఏళ్లపాటు నిరహారదీక్ష చేసి, ఆసుపత్రి అనే చెరసాలలోనే జీవితంలోని విలువైన కాలాన్ని గడిపిన ఆమె, తన లక్ష్యసాధన నిరహారదీక్షతో ఫలించేలా లేదన్న నిరాశతో గత సంవత్సరం దీక్షను విరమించింది. రాజకీయాలలోకి దిగటం ద్వారా ఆశయాన్ని సాధించాలనుకుని అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేసింది. కానీ ఫలితం.. కటిక చేదు అనుభవం ఎదురయి మళ్లీ నిరాశనే మిగిల్చింది. ఆమెకు వచ్చినవి కేవలం 90 ఓట్లు. చిత్రం ఏమిటంటే అక్కడ నోటాను నొక్కినవారు కూడా ఉన్నారు. ప్రజాహితం కోరే అభ్యర్థి పోటీచేసినా నోటాకు ఓట్లు పడటంలో తిరకాసు ఏమిటో? మరి మణిపూర్ మహిళల మాటేమిటో? కనీసం వారి మద్దతు కూడా లభించలేదంటే అక్కడ అభ్యర్థి కన్నా బలంగా అధికారం, డబ్బు.. వగైరాలు పనిచేసి ఉంటాయనేగా.

'ధర్మో రక్షతి రక్షితః'అన్నది ఆర్యవాక్కు. కానీ ఓటర్లు తమ ఓటుతో ధర్మాన్ని గెలిపించుకోకుంటే ఇక వారికి ధర్మ రక్షణ ఎక్కడ ఉంటుంది? ఇక్కడ వారు ఓడించింది షర్మిలను కాదు, నిజాయితీని.. ఇంకా చెప్పాలంటే ఓటర్లు తమను తామే వంచించుకున్నారు, ఓడించుకున్నారు. ఇరోమ్ షర్మిలకు అంగబలం, అర్థబలం, ప్రచార పటాటోపం, రాజకీయ జిత్తులు.. వంటివేవీ లేకపోవటం వల్లే ప్రజలు ఆకర్షితులు కాలేకపోయారేమో. దిగజారుడు రాజకీయాలకు ప్రతిబింబంగా మణిపూర్ మారటం ఎంతైనా శోచనీయం. ప్రజలు ఓటుహక్కును నిజాయితీగా, బాధ్యతాయుతంగా వినియోగించుకోనంత కాలం, న్యాయం, ధర్మం ఓడిపోతూనే ఉంటాయి.. ప్రజాస్వామ్యం పరిహాసిస్తూనే ఉంటుంది. నిజాయితీగా నిలిచిన షర్మిలకు ప్రజలిచ్చిన 'బహుమతి' ఎంతైనా బాధాకరం!

## లేఖలు

### స్త్రీ శక్తిని చాటింది..

మార్చి 5 వార్త ఆదివారం అనుబంధంలో అందించిన కవర్ స్టోరీ 'జయహో మహిళా!.. వివక్ష లోనూ విజయపథంలో' ఎంతో బాగుంది. నాటినుంచి నేటివరకు భారతస్త్రీ ఎదుర్కొంటున్న సమస్యలను చక్కగా వివరించారు.దాంతో పాటుగా మరోవైపు వివిధరంగాల్లో తమను తాము రుజువుచేసుకొంటూ విజయబావుటాల నెగరేస్తున్న మహిళల సంక్షిప్త పరిచయం ఎంతో స్ఫూర్తిదాయకంగా ఉంది. మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకొని చక్కని కవర్‌స్టోరీ నందించిన మీకు మా అభినందనలు.

-కె.రాధ, విజయవాడ; డి.జయంతి, నల్గొండ.

### అన్నీ మంచి అంశములే...

మార్చి 5 వార్త ఆదివారం అనుబంధంలో కవర్‌స్టోరీ ప్రతీ ఒక్కరూ చదివి తీరాల్సిన మంచి వ్యాసం. అందులోని గుప్పెడు స్ఫూర్తి' మూర్తులు వివరాలు బాగా ఎక్కువ గొప్ప మూర్తుల వివరాలే!! ఇక వసుధైక భావనతోనే సమసమాజం సాధ్యమని 'సంఘీభావం'లో చక్కగా తెలియపరిచారు. 'మూడోకన్ను'లో పేర్కొన్నట్టు అమెరికా స్వర్గమా? నరకమా? అనే విషయాన్ని ప్రతీ ఒక్కరూ తెలుసుకోవాల్సిన సమయం వచ్చింది. 'నేరము-శిక్ష' కథ ఉత్కంఠ భరితంగా సాగుతూ, చివరిదాకా చదివింపజేసింది. కొటేషన్తో కథని ముగించడం బాగుంది.

-అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, కూకట్‌పల్లి.

### సంచిక నచ్చింది..

మార్చి 5 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచిక'లో అభిలషణీయ మార్పుతోనే గమ్యం చేరడం సులువని చక్కగా చెప్పారు. వసుధైక భావన ఆవశ్యకతను 'సంఘీ'భావం లో వివరించిన తీరు బాగుంది. 'చిత్రభారతి' లో సగటు సినీ పాఠకుడు గుర్తుంచుకోవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. కస్తూరి మురళీ కృష్ణ అందించిన వికటించిన ప్రేమ బాగుంది. నేరము-శిక్ష కథ ఆసక్తికరంగా ఉంది. తరుల తరలింపు గురించిన ఆర్టికల్ ప్రయోజనకరంగా ఉంది. 'మనసు పరిమళించాలి' కవిత మా హృదయాన్ని సుగంధంతో నింపింది.

-డా.శివభూషణం, కర్నూలు.

### ముచ్చటైన మేగజైన్..

మార్చి 5 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచిక' లో చెప్పినట్లు మార్పుతోనే మంచి పరిణామాలు. 'సాహితీవనం' చక్కని శీర్షికగా మమ్మాకట్టుకుంటోంది. బ్యాక్ కవర్ ఎంతో రమణీయంగా ఉంది. 'మూడోకన్ను' స్వర్గమా? నరకమా?చదివాం. ట్రంప్ వైఖరి గర్హనీయం. బ్యాక్ ఇన్నర్ కవర్పై ఇచ్చిన అయనో సుకిని విశేషాలు, బొమ్మలు ఉత్సుకత కలిగించాయి. మీకు మా అభినందనలు.

-నేమాన సుభాష్ చంద్రబోస్, విశాఖపట్నం.

‘సంఘీ’భావం

# ప్రసూతి సెలవులు మహిళాలోకానికి వరం



సృష్టికి మూలమైన స్త్రీ విషయంలో ప్రపంచంలో పలు దేశాల దృక్పథంలో మార్పు కనిపిస్తున్నది. సమాజంలో ముఖ్యంగా పురుషుల్లో, పాలకుల్లో కూడా వారిపట్ల ఆలోచనా ధోరణిలో గణనీయమైన మార్పును చూస్తున్నాం, వింటున్నాం. ఈ కోవలోనిదే ఇటీవల కేంద్రంలోని మోడి ప్రభుత్వం ప్రవేశపెట్టిన వేతనంతో కూడిన ప్రసూతి సెలవు.

ఇప్పటిదాకా మహిళలకు ఇస్తున్న 12 వారాల వేతనంతో కూడిన ప్రసూతి సెలవును ఒక్కసారిగా కేంద్రం 26 వారాలకు పెంచింది. ఇది నిజంగా పని చేసే మహిళలకు వరంగానే చెప్పవచ్చు. అయితే ఇందులో కొన్ని షరతులున్నాయి. కానీ మొత్తంగా కేంద్రం తీసుకున్న నిర్ణయాన్ని ప్రతిఒక్కరూ ఆహ్వానిస్తున్నారు, అభినందిస్తున్నారు. మహిళా సంక్షేమానికి తీసుకున్న విప్లవాత్మకమైన నిర్ణయాన్ని మహిళా హక్కుల కార్యకర్తలే కాక సమాజం కూడా కేంద్ర ప్రభుత్వాన్ని ప్రశంసిస్తున్నది. మాతృత్వానికి కేంద్రం ఇచ్చిన వరమని వారంతా అభినందనలు కురిపిస్తున్నారు.

కేంద్ర ప్రభుత్వం తీసుకున్న ఈ నిర్ణయంతో దేశంలోని సంఘటిత రంగంలో పని చేసే 18 లక్షల మంది మహిళలకు నేరుగా ప్రయోజనం చేకూరుతుంది. పని చేస్తున్న మహిళలు గర్భవతులైన తరువాత వారి ఆరోగ్యం విషయంలో సమాజం నిర్లక్ష్య ధోరణిని ప్రదర్శిస్తున్నది. ఫలితంగా గర్భిణిలు ప్రసవం అయ్యేదాకా మానసిక, భౌతిక క్షోభను అనుభవిస్తున్నారు. అంతేతప్ప తనకు జరుగుతున్న నిర్లక్ష్యాన్ని ప్రశ్నించలేకపోతున్నారు. సమాజమే కాకుండా ప్రభుత్వం కూడా గడప దాటి బయటికి వచ్చి పురుషులతో సమానంగా పని చేస్తున్న మహిళలకు ప్రోత్సాహం ఇవ్వాల్సిన అవసరం ఉన్నది. ఇందులో భాగంగానే 1961లో ప్రభుత్వం మహిళలకు ప్రసూతి ప్రయోజనం కింద 12 వారాలు పని చేయకున్నా వేతనంతో కూడిన సెలవును మంజూరు చేసింది. కానీ మహిళలు ప్రసవం తరువాత పిల్లలకు కనీసం 24 వారాలు తల్లిపాలు ఇవ్వాలని, ఇవ్వకపోతే పిల్లల ఆరోగ్యమే కాకుండా తల్లి ఆరోగ్యం కూడా దెబ్బ తింటుందని ప్రపంచ ఆరోగ్య సంస్థ ఆందోళన వ్యక్తం చేసింది. 12 వారాలు అంటే కేవలం మూడు నెలల ప్రసూతి సెలవు ఏమాత్రం సరిపోదని మహిళా సంఘాలు కూడా ఆందోళన చేసాయి. ఆరోగ్యరంగ నిపుణులు కూడా ఈ సెలవులను పెంచాలని సిఫారసు చేశారు. వీటన్నిటిని దృష్టిలో పెట్టుకుని కేంద్రం ఒక్కసారిగా 12 నుంచి 26 వారాలు అంటే దాదాపుగా 6 నెలల, 2 వారాలకు వేతనంతో కూడిన సెలవును మంజూరు చేశాయి. దీనివల్ల కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, సాఫ్ట్‌వేర్ రంగాల్లో పని చేసే మహిళలకు ప్రయోజనం కలుగుతుంది. దాదాపుగా 6 నెలలపాటు ఇంట్లో వుండి బిడ్డను సంరక్షించడంతో తల్లీ–బిడ్డల ఆరోగ్యం, ఆయుఃప్రమాణం పెరుగుతుంది. తల్లీ–బిడ్డలకు ఎడబాటు పెరిగితే అది మాతా–శిశు మరణాలకు దారి తీస్తుంది. మాతా–శిశు మరణాలు పెరగడానికి ప్రసూతి సెలవు లేకపోవడం కూడా ఒక కారణంగా చెప్పడంతో కేంద్రం 26 వారాల సెలవును ప్రకటించింది. ఇది ఒక రకంగా సామాజిక మార్పుగా ప్రకటించవచ్చు. అయితే ఈ చట్ట సవరణను సంఘటిత రంగంలోని వారంతా అమలు చేయాలి. అమలు చేయకపోతే ప్రభుత్వం చట్టపర చర్యలు తీసుకోవాలి. లేదా లబ్ధిదారులు ఫిర్యాదు చేస్తే కంపెనీలపై చర్యలు తీసుకుంటేనే చట్ట సవరణ ప్రయోజనం నెరవేరుతుంది. అయితే కేంద్ర ప్రభుత్వం 26 వారాల సెలవును కేవలం సంఘటిత రంగానికే పరిమితం చేయడం, అది మొదటి బిడ్డకే అమలు చేయడంపై కొన్ని అభ్యంతరాలు వస్తున్నాయి. ఈ విషయంలో కూడా కేంద్రం సానుకూల దృక్పథంతో పరిశీలిస్తే ఇంకా మంచిది. ఎందుకంటే సంఘటిత రంగంలోకంటే అసంఘటిత రంగంలోనే మహిళలు ఎక్కువగా పని చేస్తున్నారు. వారికి కనీస వేతనాలు ఉండవు. గొడ్డుచాకిరీ చేయాల్సిందే. ఒకవైపు బిడ్డను చూసుకుంటూనే మరోవైపు పని చేసినా పురుషులతో సమానంగా వేతనాలు రాని సమాజంలో మహిళలున్నారు. ఈ పరిస్థితుల్లో అసంఘటిత రంగానికి కూడా ఈ సెలవులను అనుమతించడం, ఒక బిడ్డకు కాకుండా రెండో బిడ్డకు కూడా సెలవులను ఆమోదించడం చేస్తే కేంద్రానికి ఇంకా మంచి పేరు వస్తుందని కొందరు సూచిస్తున్నారు. ప్రసూతి సెలవులతో పాటు మాతా–శిశు సంరక్షణకు మరికొన్ని చర్యలు తీసుకోవాలని కూడా వారు సూచిస్తున్నారు.

మహిళ గర్భం దాల్చిన మూడో నెల నుంచి అనేక ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయి. మూడో నెల నుంచి ప్రసూతి సెలవు ముగిసే 26 వారాల వరకు తల్లీ–బిడ్డలను అన్ని రకాలుగా పరిరక్షించడానికి ప్రభుత్వాలు చర్యలు తీసుకుంటే ఇంకా మంచిదని మరికొందరు సూచిస్తున్నారు. కేంద్రం తీసుకున్న ఈ నిర్ణయం మరికొన్ని మార్పులకు దారి తీయాలని వారంతా కోరుతున్నారు.

కేంద్రమే కాకుండా పలు రాష్ట్ర ప్రభుత్వాలు గర్భిణీలకోసం, పిల్లలకోసం పలు రకాల సంక్షేమ కార్యక్రమాలు చేపడుతున్నాయి. ఈ విషయంలో తమిళనాడు రాష్ట్రం ముందు వరుసలో ఉంది. అక్కడ గర్భిణిలకు ప్రసూతి సహాయం పూర్తి స్థాయిలో అందుతున్నది.

తెలంగాణా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు కూడా గర్భిణిలకు ప్రసవానంతరం కిట్‌లను ఇస్తూ, ఆర్థిక సహాయాన్ని 12 వేలకు పెంచాయి. అదే గాకుండా కొత్తగా సవరించిన చట్టంలో పని చేసే ప్రదేశంలో బిడ్డల సంరక్షణ కేంద్రాలను ఖచ్చితంగా ఏర్పాటు చేయాలని నిర్దేశించారు. ఈ కేంద్రంలో పిల్లలను చూసుకుంటూనే తల్లులు విశ్రాంతితో పని చేయవచ్చు. అదీగాక కంపెనీలు ఒప్పుకుంటే ‘వర్క్ ఫ్రం హోం’ విధానాన్ని కూడా అంగీకరించింది.

చట్టసవరణ మరికొందరు మహిళలు వివిధ వృత్తుల్లోకి, ఉద్యోగాల్లోకి రావడానికి అవకాశం కల్పిస్తున్నది. అయితే మహిళల ప్రసూతి సెలవుల విషయంలో మంచి దేశాలు, చెడ్డ దేశాల గురించి ఇక్కడ ప్రస్తావించాలి. గొప్ప దేశం అని చెప్పుకునే అమెరికాలో అసలు ప్రసూతి సెలవులు లేవు. లైబేరియా, స్వాజీలాండ్, లెసోతో, న్యూగునియా లాంటి దేశాలు కూడా అమెరికా వెంటే ఉండగా ప్రపంచంలో స్వీడన్ 56 వారాల ప్రసూతి సెలవులను మంజూరు చేస్తూ ప్రపంచంలోనే అగ్రగామి దేశంగా మారింది. ఆ తరువాత కెనడా 50 వారాలు, నార్వే 44 వారాలు ప్రసూతి సెలవులను ఇస్తూ మొదటి మూడు స్థానాల్లో నిలిచాయి. చైనాలో ఈ సెలవులు 12 వారాలే. ఈ లెక్కన చూస్తే ప్రభుత్వం తీసుకున్న నిర్ణయాన్ని ప్రతిఒక్కరూ ముక్తకంఠంతో అభినందించాల్సిందే.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ



# మోడీ జైత్రయాత్ర

– ఎ.వి.వి. ప్రసాద్

కర్ణుడి చావుకి ఎన్ని కారణాలైనా చూపవచ్చు. కానీ అంతిమ విజయం ఎవరిదన్నదే ప్రధానం. తాజాగా జరిగిన ఎన్నికల్లో దేశంలోనే అతికీలక రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్ తిరిగి బిజెపి వశం కావడం అటువంటిదే. రాజకీయ పండితుల అంచనాలను సైతం మించిన విజయం బిజెపికి ఈ రాష్ట్రంలో లభించిందంటే దానికి ప్రధాన కారణం మోడీ విధానాలే అని చెప్పకతప్పదు. చాలా భారీ సంఖ్యలో 403 అసెంబ్లీ స్థానాలున్న యుపిలో ఏ పార్టీ అధికారంలోకి వస్తే ఆ ప్రభావం కేంద్రంపై తప్పక కనిపిస్తుందన్నది గత ఆరున్నర దశాబ్దాలుగా చూస్తున్నదే. కేంద్రంలో అధికారంలోకి వచ్చిన ఏ జాతీయ పార్టీ అయినా తన చూపునంతా ఎప్పుడూ యుపిపైనే నిలుపుతూంటుంది. బిజెపికి చోదక శక్తిగా ఉన్న ప్రధాని మోడీ చేసింది కూడా అదే. తాను కేంద్రంలో అధికారంలోకి వచ్చిన మూడు సంవత్సరాల్లో ఆ రాష్ట్రాన్ని తన గుప్పెటలోకి తెచ్చుకున్నారు. గతంలో కాంగ్రెస్‌కు కంచుకోట అనిపించుకొన్న ఆ రాష్ట్రం ఇప్పుడు బిజెపికి కంచుకోటగా మారిపోయింది.

**ఎన్నికల రణాన ఎదురులేదను రీతి**
**సాగుచుండె మోడి జనులు మెచ్చ;**
**పెక్కు రాష్ట్రములను వేలితో గెలుపొందె**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

ఒకప్పుడు చక్రవర్తులు తమ సామ్రాజ్య విస్తరణకు యుద్ధాలు చేసేవారు. యుద్ధంలో ఓడిన రాజును సామంతునిగా చేసుకొనేవారు. ఆ యుద్ధం కూడా రెండురకాలుగా ఉండేది. కొన్ని రాజ్యాలను ఎంపిక చేసుకొని వాటిపై నేరుగా దండెత్తడం ఒకటయితే, చక్రవర్తి ఆధిక్యతను గుర్తించక తలఎగరేసే రాజును అదుపులోకి తెచ్చుకొనడానికి చేసే యుద్ధం మరొకటి. అందుకు గుర్రాన్ని సాధనంగా చేసుకొనేవారు. తమ వద్ద గల యజ్ఞాశ్వాన్ని అన్ని రాజ్యాలకు పంపించేవారు. ఆ గుర్రం వెళ్లిన ప్రతి రాజ్యంలో అక్కడిరాజు దానికి రాచమర్యాదలు చేసి పంపిస్తే అతడు అధీనంలో ఉన్నట్లు లెక్క. ధిక్కరిస్తే అతడు కయ్యానికి కాలు దువ్వుతున్నట్లు లెక్క. దాని ప్రాతిపదికగా చక్రవర్తి ఆ రాజ్యంపై దండెత్తడానికి వెళ్లాలో వద్దో తేల్చుకొనేవాడు. దానినే అశ్వమేధ యాగమని కూడా అంటారు. ఇప్పుడా చక్రవర్తులు, ఆ యాగాలు లేకపోయినా అధినేతలలో 'విస్తరణ' కాంక్ష మాత్రం తేడాలేకుండా అలాగే ఉంది. ప్రస్తుతం మనం చూస్తున్నవి ప్రజాస్వామ్యవ్యవస్థలు గనుక, ఇలాంటి వ్యవస్థలో హింసకు, యుద్ధాలకు తావులేదు గనుక– దానికి ప్రత్యామ్నాయంగా ఎన్నికల పద్ధతి అనుసరిస్తున్నారు. ఎన్నికలనే అశ్వాన్ని ప్రజల వద్దకు పంపుతున్నారు.

కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీకి సహజంగానే రాష్ట్రాల్లోనూ పాలన సాగించాలనే కాంక్ష ఉంటుంది గనుక ఎన్నికల యుద్ధంలో తమ భవిష్యత్తును తేల్చుకొంటున్నారు. రాజ్యాలను గెలుచుకొనడానికి చేసే జైత్రయాత్రలో విజయాలూ ఉంటాయి, అపజయాలూ ఉంటాయి. విజయాలు అధికంగా ఉంటే దేశంలోని అన్ని రాజ్యాలు (రాష్ట్రాలు) ఆ చక్రవర్తి (కేంద్రంలోని అధికారపార్టీ) ఏలుబడిలోకి వస్తాయి. అపజయాలు అధికమైతే ఆ పెద్ద పార్టీ క్రమంగా బలహీనపడి ఏవో కొన్ని చిన్న రాష్ట్రాలకు పరిమితం కావడమో, లేక పూర్తిగా అంతరించడమో జరుగుతుంటుంది. ఇప్పుడు దేశంలోని రాజకీయ దృశ్యాన్ని చూస్తే కనిపించేది అదే. తాజాగా ఐదు రాష్ట్రాలకు జరిగిన ఎన్నికల్లో లభించిన ఫలితాలతో బిజెపి దేశంలో అధికశాతం ప్రాంతం, అధికశాతం ప్రజలను తన అధీనంలోకి తెచ్చుకొన్న పార్టీగా నిలబడితే, గతంలో దేశాన్నంతా తన 'చేతి'లో ఉంచుకొన్న కాంగ్రెస్ ఇప్పుడు కేవలం ఒక చేతివేళ్లకే పరిమితమైన సంఖ్యకు వచ్చేసింది. 2014 నుంచి మారిపోయిన రాజకీయ దృశ్యానికి ఈ వాస్తవం అద్దంపడుతోంది.

ప్రతి సంవత్సరం నాలుగైదు రాష్ట్రాలకు ఎన్నికలు జరగడం, వాటిలో చాలావరకు కేంద్రంలో అధికారంలో ఉన్న బిజెపి వలలో పడడం గత మూడు సంవత్సరాలుగా అలవాటయిపోయింది. ఎన్నికలు జరిగిన ప్రతిసారి బిజెపి పాలిత రాష్ట్రాల సంఖ్య క్రమంగా పెరుగుతూ దేశంలోని మొత్తం 130 కోట్ల ప్రజలలో 62 శాతం మంది బిజెపి పాలనలోకి వచ్చారంటే..ఆ విజయం..ఆ విస్తరణ చాలా అసాధారణమైనదనే చెప్పాలి. దీనంతటికి వెనుక ఉన్న ఒకేఒక శక్తి నరేంద్ర మోడీ. బిజెపికి, కాంగ్రెస్‌కు గల ప్రధానమైన వ్యత్యాసం అక్కడే కనిపిస్తుంది. కాంగ్రెస్‌లో నాయకుల కంటె ప్రజలపై పార్టీ ప్రభావం ఎక్కువగా ఉండేది. కానీ ఇప్పుడు బిజెపిలో పార్టీ కంటే మోడీ అనే వ్యక్తి శక్తి ప్రభావమే ఎక్కువగా కనిపిస్తోంది. 2014 లోక్‌సభ ఎన్నికల్లో ఒక ప్రభంజనంలా దూసుకువచ్చిన మోడీని మైనస్ చేస్తే– బిజెపిలో పార్టీ ప్రభావాన్ని చూపగలిగే నేతలు అతి తక్కువగా కనిపిస్తారు. అమిత్ షా వ్యూహాలు మోడీకి వెన్నుదన్నుగా ఉన్నా, మోడీని మైనస్ చేస్తే ఆ వ్యూహాల ప్రభావమూ అంతంతమాత్రంగానే ఉంటుంది. మరో అగ్రనేత అద్వానీ కూడా శక్తిగా ఎదిగిన వ్యక్తే అయినా ఆయన క్రియాశీల రాజకీయాలనుంచి దాదాపు పక్కకు తప్పుకొనడంతో ఇక మేరునగంలా కనిపించే శక్తి, పార్టీని ప్రతి ఎన్నికలోనూ విజయపథంలోకి నడిపిస్తున్న చోదకశక్తి, మోడీ ఒక్కరే కనిపిస్తారు. దేశంలోని మధ్య ప్రాంతం, ఈశాన్య ప్రాంతం చాలావరకు బిజెపి గొడుకుకిందకు వచ్చేశాయి. మరో 20శాతం ప్రాంతం 2019 లోక్‌సభ ఎన్నికల్లోగా వస్తే దేశంలో మూడు వంతులు పైగా ప్రాంతం ప్రజలు బిజెపి పాలనలోకే వచ్చేస్తారు. అంటే మోడీ ఒక రాజకీయశక్తిగా ఎలాంటి ప్రభావం దేశంపై చూపుతున్నారో దీనిని బట్టే అర్థమవుతుంది. తాజాగా ఎన్నికలు జరిగిన ఐదు రాష్ట్రాలలో పంజాబ్ మినహా మిగిలిన అన్నిచోట్లా బిజెపి ఓట్లు అధికశాతం పెరగడాన్ని చూస్తే ఆ పార్టీ గ్రాఫ్ ఎంత వేగంగా ముందుకు వెళ్తున్నదో, మిగిలిన ప్రధాన పార్టీలు ఎంతవేగంగా వెనకబడుతున్నాయో కూడా అర్థమవుతుంది. కేవలం మూడు సంవత్సరాల వ్యవధిలో ఒక పార్టీ ఏలుబడిలోని ప్రజలను 25నుంచి 62శాతానికి పెంచిన ఘనత కూడా స్వాతంత్ర్యానంతర రాజకీయ చరిత్రలో ఒక్క మోడీకే దక్కుతున్నదంటే జైత్రయాత్రలో ఆయనకు ఎదురేముంటుంది! అనే అనిపిస్తుంది.

***********

కర్ణుడి చావుకి ఎన్ని కారణాలైనా చూపవచ్చు. కానీ అంతిమ విజయం ఎవరిదన్నదే ప్రధానం. తాజాగా జరిగిన ఎన్నికల్లో దేశంలోనే అతికీలక రాష్ట్రమైన ఉత్తరప్రదేశ్ తిరిగి బిజెపి వశంకావడం అటువంటిదే. రాజకీయ పండితుల అంచనాలను సైతం మించిన విజయం బిజెపికి ఈ రాష్ట్రంలో లభించిందంటే దానికి ప్రధాన కారణం మోడీ విధానాలే అని చెప్పకతప్పదు. చాలా భారీసంఖ్యలో 403 అసెంబ్లీ స్థానాలున్న యుపిలో ఏ పార్టీ అధికారంలోకి వస్తే ఆ ప్రభావం కేంద్రంపై తప్పక కనిపిస్తుందన్నది గత ఆరున్నర దశాబ్దాలుగా చూస్తున్నదే. కేంద్రంలో అధికారంలోకి వచ్చిన ఏ జాతీయ పార్టీ అయినా తన చూపునంతా ఎప్పుడూ

యుపి పైనే నిలుపుతూంటుంది. బిజెపికి చోదక శక్తిగా ఉన్న ప్రధాని మోడీ చేసింది కూడా అదే. తాను కేంద్రంలో అధికారంలోకి వచ్చిన మూడు సంవత్సరాల్లో ఆ రాష్ట్రాన్ని తన గుప్పెటలోకి తెచ్చుకున్నారు. గతంలో కాంగ్రెస్‌కు కంచుకోట అనిపించుకొన్న ఆ రాష్ట్రం ఇప్పుడు బిజెపికి కంచుకోటగా మారిపోయింది. గత అసెంబ్లీ ఎన్నికల్లో కేవలం 15 శాతం ఓట్లు, 47 సీట్లు మాత్రమే ఉన్న బిజెపి తాజా ఎన్నికల్లో 47 శాతం ఓట్లతో 312 (మిత్ర పక్షాలతో కలిపి 325) సీట్లను గెలుచుకొన్నదంటే 2012లో లేనిది, ఇప్పుడు ఉన్నది మోడీ ప్రభంజనమే. 2014 లోక్‌సభ ఎన్నికల్లోనే ములాయం-అఖిలేష్ నాయకత్వం లోని సమాజ్‌వాది పార్టీ ఘోరంగా విఫలమైందని, అయితే అవి జాతీయ ఎన్నికలు గనుక ప్రజల ఓట్ల సరళి విభిన్నంగా ఉంటుందని సరిపెట్టుకొన్నారు. గత అసెంబ్లీ ఎన్నికల్లో 29.1 ఓట్ల శాతంతో ఎస్‌పి 224 సీట్లు గెలుచుకోగా ఆ ఓట్ల శాతం ఇప్పుడు 21 శాతానికి పడిపోయి సీట్లు కూడా 47కు తగ్గిపోయాయి. కాంగ్రెస్‌తో పొత్తు పెట్టుకొని పోటీ చేసినా మొత్తంమీద 54 సీట్లు దాటిరాలేదంటే ఆ రెండు పార్టీలు రాష్ట్రంలో ఎంత విఫలమయ్యాయో అర్థమవుతుంది. యుపిలో మరో పెద్ద పార్టీ అయిన మాయావతి నాయకత్వంలోని బిఎస్‌పి కూడా మోడీ ప్రభంజనలో కొట్టుకుపోయింది. గత ఎన్నికల్లో ఆ పార్టీ 25 శాతం ఓట్లు, 80 సీట్లతో బలమైన ప్రతిపక్షంగా ఉండగా, ఇప్పుడు 19 సీట్లకే పరిమితమై వెనుక బెంచీలకు చేరిపోయింది.. అఖిలేష్ నాయకత్వంలోని ఎస్పీతో పొత్తు పెట్టుకొన్న కాంగ్రెస్‌కు ఏడు సీట్లు మించి రాలేదంటే తనను పెంచి పెద్ద చేసిన రాష్ట్రాన్ని సైతం ఆ పార్టీ పూర్తిగా కోల్పోయినట్లే అనిపిస్తుంది. అంతేకాదు కాంగ్రెస్ పార్టీకి జాతీయ అధ్యక్షురాలైన సోనియాగాంధీ, ఉపాధ్యక్షుడైన రాహుల్ గాంధీలు ప్రాతినిధ్యం వహిస్తున్న రెండు అసెంబ్లీ నియోజక వర్గాలు రాయ్‌బరేలీ, అమేథీలు సైతం వారి 'చే'జారి పోతుండడం ఆ పార్టీ అభిమానులకు చాలా ఆందోళన కలిగించే అంశం. ముఖ్యంగా ఈ రెండు లోక్‌సభ స్థానాలు నెహ్రూ, ఇందిర కాలం నుంచి కాంగ్రెస్‌కు అరచేతిలో అరటిపండులా ఉంటున్నాయి. కానీ అదేచోట ఇప్పుడు బిజెపి 'కమల పరిమళాలు' వ్యాపిస్తున్నాయి. ఈ రెండు నియోజక వర్గాల్లోని మొత్తం 10 అసెంబ్లీ సెగ్మెంట్లలో ఆరు చోట్ల తాజాగా బిజెపి విజయం సాధించగలిగిందంటే కాంగ్రెస్ కాళ్లకింద నేల ఎంత త్వరగా కరిగిపోతున్నదో స్పష్టమవుతుంది.






ఎస్‌పి, కాంగ్రెస్‌ల నుంచి మెజారిటీ సీట్లను కైవసం చేసుకొనడం లోనేగాక, ముస్లిం అధికత్య ప్రాంతాల్లో కూడా బిజెపి తన స్థానం పదిలం చేసుకోవడం ఈ ఎన్నికల్లో మరో విశేషంగా కనిపిస్తుంది. 1991లో రామజన్మభూమి ఉద్యమ సమయంలో అవిభక్త యుపిలో బిజెపి అత్యధికంగా 425 సీట్లకుగాను 221 సాధించగలిగింది. దానికి ముందు జనతాపార్టీ మాత్రమే అంత భారీగా (352) సీట్లను గెలుచుకోగలిగింది. ఆ తర్వాత ఇన్నాళ్లకు తన రికార్డును తానే అధిగమించి 312 సీట్లతో బిజెపి సరికొత్త రికార్డు సృష్టించింది. ఒక్క మాటలో చెప్పాలంటే 2014 లోక్‌సభ ఎన్నికల్లో మోడీ సృష్టించిన రికార్డుకంటె ఇది అనేక రెట్లు పెద్దదన్నమాట. యుపిలోని వారణాసిని తన రెండో పార్లమెంటు స్థానంగా ఎంచుకొని 2014లో మోడీ బరిలోకి దిగినప్పుడే ఆయన కన్ను యుపిపై ఉన్నదనే విషయం స్పష్టమైంది. ఇప్పుడు అత్యధిక అసెంబ్లీ సీట్లతో యుపిలో తమ పార్టీని అధికారంలోకి తేగలిగారంటే మూడేళ్లుగా ఆయన దృష్టి ఈ రాష్ట్రంపై ఎంతగా కేంద్రీకృతమైందో అర్థమవుతుంది. దీనిలో ఆయన జైత్రయాత్ర మూడు వంతులు పూర్తయినట్లే.



కేంద్రంలో బిజెపి 2014లో అత్యధిక స్థానాలతో అధికారంలోకి వచ్చిన తర్వాత ఇప్పటిదాకా 14 రాష్ట్రాలకు ఎన్నికలు జరగగా వాటిలో ఏడు అసెంబ్లీలు బిజెపి పరివారంలోకి వచ్చి చేరాయి. 2014 నాటి మోడీ ప్రభంజనం దాదాపుగా ప్రతి అసెంబ్లీ ఎన్నికల్లోనూ కనిపిస్తూనే ఉంది. గత సంవత్సరం అసోంలో అఖండ విజయం సాధించి ఈశాన్యంలో కూడా తొలి అడుగు వేసింది. తాజా ఎన్నికల్లో మణిపూర్ లో పూర్తి మెజారిటీ సాధించలేకపోయినా, ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగల సంఖ్యా 'బలం' కూడగట్టుకొంది. ఇలా కొద్ది కొద్దిగా దేశ ఈశాన్య ప్రాంతంలోనూ బిజెపి విస్తరిస్తోంది. మహారాష్ట్రం నుంచి యుపిదాకా పలు పెద్ద రాష్ట్రాలలో ఇప్పటికే బిజెపి పునాదులు బలపడుతూండడంతో అతి త్వరలో ఎన్నికలు జరిగే మరికొన్ని రాష్ట్రాల్లోని ఇతర పార్టీలకు వెన్నులో వణుకు మొదలవుతోంది. 2014 లోక్‌సభ ఎన్నికల అనంతరం అదే సంవత్సరంలో అక్టోబర్-డిసెంబర్‌ల మధ్య హర్యానా, మహారాష్ట్ర, జార్ఖండ్, జమ్మూ-కాశ్మీర్ రాష్ట్రాల అసెంబ్లీలకు ఎన్నికలు జరగగా ఆ నాలుగు చోట్ల బిజెపియే అఖండ విజయం సాధించింది. ఢిల్లీ, బీహార్‌లో ప్రతికూల ఫలితాలు లభించినా, మిగిలిన చోట్ల సీట్లు, ఓట్లు పెంచుకొంటూ మోడీ విజయరథం సాగుతూనే ఉంది. తాజా ఎన్నికల్లోనూ పంజాబ్ మినహా మిగిలిన నాలుగు రాష్ట్రాలైన యుపిలో 40 శాతం, ఉత్తరాఖండ్‌లో 46 శాతంతో పాటు గోవాలో 32 శాతం, మణిపూర్‌లో 36 శాతం ఓట్లతో బిజెపి తిరుగులేని ఆధిక్యతను ప్రదర్శించింది.

కొన్ని పరాజయాలున్నా, మొత్తం మీద విజయాలే అధికంగా సాధిస్తూ మోడీ జగన్నాథ రథం సాగిస్తున్న జైత్రయాత్ర చూస్తుంటే 2019 లోక్‌సభ ఎన్నికల్లోనూ ఇదే ప్రభంజనం కొనసాగవచ్చనే అనిపిస్తుంది. అయితే దక్షిణాది రాష్ట్రాలు మాత్రం ఆ పార్టీకి ఇంకా కొరకరాని కొయ్యలుగానే ఉండవచ్చనిపిస్తుంది. ప్రాంతీయ పార్టీలు బలంగా ఉన్న తమిళనాడు, ఎపి, తెలంగాణలో బిజెపికి కొద్ది సీట్లు పెంచుకోగలిగే అవకాశం ఉన్నా అధికారంలోకి రావడం ఇప్పట్లో కష్టమే అవుతుంది. కర్ణాటకలో తిరిగి అధికారంలోకి రాగల అవకాశం ఉందిగాని పార్టీలోని అగ్రనేతలపై గల అవినీతి ఆరోపణలు ఆ విజయావకాశాలను కుంగదీస్తున్నాయి. కేరళలో కూడా బిజెపి పరిస్థితి అంతంతమాత్రమే గనుక దక్షిణాదిలో ఇప్పట్లో అధికారంలోకి రాగల అవకాశం లేకపోయినా, 2019లో ఎన్నికలు జరిగే పది అసెంబ్లీలు గుజరాత్, కర్ణాటక, మధ్య ప్రదేశ్, రాజస్థాన్, చత్తీస్‌గఢ్, హిమాచల్, మేఘాలయా, మిజోరం, నాగాలాండ్, త్రిపురలో మెజారిటీ రాష్ట్రాలు, సీట్లు సాధించగలిగితే వచ్చే లోక్‌సభ ఎన్నికల నాటికి మోడీ ఒక్కరే దేశంలో జాతీయ స్థాయి నేతగా కనిపిస్తారు.

మొత్తం అన్ని రాష్ట్రాలు కాంగ్రెస్ చేతుల్లోంచి క్రమంగా బిజెపి చేతుల్లోకి మారిపోతున్న దృశ్యమే ప్రస్తుతం దేశమంతా కనిపిస్తోంది. 'పెద్ద నోట్ల రద్దు' మోడిని ముంచేస్తుందనుకొన్నవారందరికి యుపి, ఉత్తరాఖండ్‌లు గట్టి సమాధానమే ఇచ్చాయి. అయితే ఈ బలం ఇచ్చిన విజయగర్వం మోడిని సంస్కరణల నుండి తప్పించకుండా ఉంటే ఓ కొత్త అభివృద్ధి చిత్రాన్ని భవిష్యత్తులో అందించగలదనే అనిపిస్తుంది. ■

# హృద్రోగుల హార్ట్ అని 'స్టెంట్'!

కవర్‌స్టోరీ

ఎం. వేదాంతాచార్యులు
సీనియర్ రిపోర్టర్, స్టేట్ బ్యూరో.

మానవ శరీరంలో అత్యంత కీలకమైన భాగం గుండె. ఆ గుండె 'లబ్ డబ్' అంటూ క్రమబద్ధంగా పనిచేస్తేనే మనిషి ప్రాణంతో ఉండగలడు. లేదంటే ఇంతే సంగతులు. గుండె సక్రమంగా పనిచేయాలంటే గుండెకు రక్త సరఫరా నిరంతరాయంగా జరగాలి. అంటే శరీరంలోని ధమనులు సమర్థవంతంగా పనిచేయాలి. కానీ అనేకానేక కారణాల వల్ల ధమనుల్లో కొవ్వు చేరి, రక్త సరఫరాకు ఆటంకం కలిగితే ప్రాణ సంకటమే. కొవ్వు కారణంగా ధమనులు ఇరుకై గుండెజబ్బుకు గురయ్యేవారి సంఖ్య నానాటికీ పెరగటం తెలిసిందే. హార్ట్ పేషెంట్ల గుండెలకు అండగా నిలిచేందుకు రూపొందినవే స్టెంట్లు. మొన్నమొన్నటివరకు స్టెంట్ల ఖరీదు మరీ ప్రియంగా ఉండటంతో సామాన్యులకు అవి అందుబాటులో లేక గుప్పెడంత గుండెకోసం మోపెడు అప్పుచేయాల్సిన పరిస్థితి. కానీ ఇటీవల స్టెంట్ల ధరలు తగ్గాయి. ఇది పేద హార్ట్ పేషెంట్ల పాలిటి వరమనే చెప్పాలి. ఈ నేపథ్యంలో స్టెంట్ల గురించిన సమగ్ర కథనం ఈవారం మీకోసం..

ఆధునిక పోకడల పేరుతో మారుతున్న జీవన విధానాలు, ఆహారపు అలవాట్లు మనిషి గుండెపై తీవ్రమైన చెడు ప్రభావాన్ని చూపిస్తున్నాయి. మారుతున్న జీవన శైలితో హృద్రోగ సంబంధిత వ్యాధుల బారిన పడుతున్న వారి సంఖ్య నానాటికీ పెరిగిపోతోంది. శరీరంలోని ధమనుల ద్వారా శరీరం నుంచి గుండెకు రక్తం సరఫరా జరుగుతుంది. ఈ ధమనుల్లో కొవ్వు చేరితే గుండెకు చేరే రక్తం మధ్యలోనే ఆగిపోతుంది. కొవ్వుతో ధమనుల్లో ఏర్పడే అడ్డుగోడలను వైద్య పరిభాషలో బ్లాకేజ్ అంటారు.


ధమనిలో కొవ్వు పేరుకుపోయి గుండెకు రక్త సరఫరాకు ఆటంకమైన స్థితి..

హృద్రోగుల గుండె చప్పుడును కాపాడటానికి శరీరంలో కృత్రిమంగా స్టెంట్ (సన్నని తీగలాంటి ట్యూబ్)ను అమరుస్తారు. దీనినే క్యాథెటర్ అంటారు. ఈ క్యాథెటర్ ద్వారా స్టెంట్‌ను గుండె నాళాల్లోకి పంపుతారు. తరువాత స్టెంట్‌ను బ్లాకేజ్ మధ్యలో అమర్చితే గుండెకు రక్తం సరఫరా సాఫీగా సాగుతుంది. మానవ శరీరంలోని అన్ని అవయవాల కన్నా గుండె అత్యంత ప్రధానమైంది. ఈ అవయవానికి ఏదైనా జరిగితే మొత్తం జీవక్రియ దెబ్బతింటుంది. అందుకే గుండెను కాపాడుకోవడానికి ఎంతైనా ఖర్చు పెడతారు.పేద రోగులు మరో దిక్కులేక స్టెంట్ల కోసం లక్ష రూపాయలు ఖర్చు చేస్తున్నారు.

ఇందుకోసం కొందరు తమ ఆస్తులను సైతం అమ్ముకుంటున్నారు. ఇదే అదనుగా ప్రాణంపై ఉన్న ఆశను అడ్డుపెట్టుకుని వ్యాపారులు కోట్లాది రూపాయలు సంపాదిస్తున్నారు. నిజానికి స్టెంట్ల పేరుతో దేశవ్యాప్తంగా జరుగుతున్న దోపిడీ ఈనాటిది కానప్పటికీ ఇటీవల కేంద్ర ప్రభుత్వం స్టెంట్లను 'నేషనల్ లిస్ట్ ఆఫ్ ఎసెన్షియల్ మెడిసిన్స్' జాబితాలో చేర్చడంతో వీటి ధరలు అమాంతం కొండ నుంచి దిగి వచ్చాయి.

అయితే, స్టెంట్ల తయారీ కంపెనీదారులతో పాటు డిస్ట్రిబ్యూటర్లు, వైద్యులు కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తుండటంతో ప్రస్తుతం ఈ అంశం చర్చనీయాంశంగా మారింది.

### నేషనల్ లిస్ట్ ఆఫ్ ఎసెన్షియల్ మెడిసిన్స్ అంటే....

కేంద్ర ప్రభుత్వం ఇటీవల స్టెంట్లను 'నేషనల్ లిస్ట్ ఆఫ్ ఎసెన్షియల్ మెడిసిన్స్' జాబితాలో చేర్చింది. ఈ జాబితాలో చేర్చిన వస్తువుల ధరలను కంపెనీలు నిర్ణయించలేవు. ప్రభుత్వం నిర్దేశించిన ధరలకే కంపెనీలు తమ ఉత్పత్తులను విక్రయించాల్సి ఉంటుంది. స్టెంట్ల ధరలపై గత ఫిబ్రవరి 13న ప్రభుత్వం తన నిర్ణయాన్ని ప్రకటించింది.

గతంలో రూ. 30 వేల నుంచి రూ. లక్ష వరకు విక్రయించిన మెటల్ స్టెంట్‌ను కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన మార్గదర్శకాల మేరకు స్టెంట్ల తయారీదారులు ఇకపై కేవలం రూ. 7,260కే అమ్మాల్సి ఉంటుంది. డ్రగ్ ఎల్యూటింగ్ స్టెంట్ ధర గతంలో రూ. 40 వేల నుంచి రూ. 2 లక్షలు పలికేది. దీనిని ఇప్పుడు కేవలం రూ. 29,600కే విక్రయించాలని కేంద్రం స్పష్టం చేసింది.

## ధరల తగ్గింపుతో కేంద్రంపై ఒత్తిడి

స్టెంట్ల ధరలను కేంద్ర ప్రభుత్వం భారీగా తగ్గించడంతో భారీగా సొమ్ము చేసుకునే అవకాశం కోల్పోవడంతో బడా కంపెనీలు కొత్త నాటకానికి తెరతీశాయి. ధరలను మళ్లీ పెంచే దిశగా ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తున్నాయి. ఇందులో భాగంగా ఆ కంపెనీలు ఇప్పటికే మార్కెట్‌లో సరఫరా చేసిన స్టెంట్లను ఆసుపత్రుల నుంచి వెనక్కి తీసుకుంటున్నాయి. తగ్గించిన ధరలకు స్టెంట్లను అమ్మలేమనీ స్పష్టం చేస్తున్నాయి. ముఖ్యంగా విదేశీ కంపెనీలు రీలేబులింగ్ పేరుతో తమ స్టెంట్లను మార్కెట్ నుంచి వెనక్కి రప్పిస్తున్నాయి. దీంతో ఆసుపత్రుల్లో మేలురకం స్టెంట్ల కొరత ఏర్పడింది. ప్రీమియం బ్రాండ్ స్టెంట్లు అందుబాటులో లేకపోవడంతో తెలుగు రాష్ట్రాలలో వందల సంఖ్యలో యాంజియోప్లాస్టీ చికిత్సలు నిలచిపోయాయి.



ఆంధ్రప్రదేశ్-తెలంగాణ రాష్ట్రాలలో ప్రతీ ఏటా దాదాపు లక్ష మంది హృద్రోగులు స్టెంట్లు వేయించుకుంటున్నారు. ప్రభుత్వం ముందు జాగ్రత్త లేకుండా స్టెంట్ల ధరలను తగ్గించడంపై వైద్య నిపుణులు భిన్నాభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు. ముందస్తు సన్నద్ధత లేకుండా స్టెంట్ల ధరలను తగ్గించడంతో వీటి తయారీ దారులు మార్కెట్లో కృత్రిమ కొరతను సృష్టించి రోగులను అనేక ఇబ్బందులకు గురి చేస్తున్నారు. తగ్గించిన ధరలకే విక్రయించేలా విదేశీ కంపెనీలను సైతం ఒప్పించి తరువాతనే కేంద్ర ప్రభుత్వం నిర్ణయాన్ని ప్రకటిస్తే బాగుండేదని పేర్కొంటున్నారు. కంపెనీల ఒత్తిడికి లొంగకుండా నిర్దేశించిన ధరలకే నాణ్యమైన స్టెంట్లను సరఫరా చేసేలా ప్రభుత్వం చర్యలు తీసుకోవాల్సి ఉంది. ప్రపంచంలోని ఆయా స్టెంట్ల కంపెనీలకు మన దేశం అతి పెద్ద మార్కెట్‌గా ఉంది. ఆయా కంపెనీలు ఇక్కడున్న అవకాశాలను ఎక్కువ కాలం వదులుకోలేవనీ నిపుణులు అభిప్రాయపడుతున్నారు. స్టెంట్ల కృత్రిమ కొరతను సృష్టించి ఇంకెన్నో రోజులు ప్రభుత్వాన్ని బ్లాక్ మెయిల్ చేయలేవని అంటున్నారు.




## స్టెంట్లు...రకాలు

స్టెంట్ల పేరుతో అడ్డగోలు దోపిడీకి కళ్లెం వేయాలని కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన నేపథ్యంలో అసలు స్టెంట్లలో ఎన్ని రకాలు ఉంటాయి ? వాటి ప్రత్యేకతలు, ధరల గురించి తెలుసుకుందాం. ప్రస్తుతం స్టెంట్లలో ప్రధానంగా రెండు రకాలు మార్కెట్‌లో అందుబాటులో ఉన్నాయి. బేర్ మెటల్ స్టెంట్....ఇది లోహపు స్టెంట్. రక్తనాళంలో పూడికను తొలగించేందుకు దీనిని వినియోగిస్తారు. అయితే, ఇది మళ్లీ పూడికలు రాకుండా అడ్డుకోలేదు. వీటి వినియోగం ఇప్పుడు బాగా తగ్గిపోయింది. కేవలం 5 శాతం లోపు మాత్రమే వీటిని వినియోగిస్తారు. వీటి ధర ప్రస్తుతం మార్కెట్‌లో రూ. 45 వేల వరకు ఉంది. కాగా, కేంద్ర ప్రభుత్వ తాజా మార్గదర్శకాల ప్రకారం ఇప్పుడు దీని ధర రూ. 7,260గా నిర్ణయించారు. పన్నులతో కలిపితే గరిష్ఠంగా దీని ధర రూ. 7,623 అవుతుంది. వీటి తయారీకి అయ్యే ఖర్చు రూ. 5,415 తాజా నిర్ణయంతో రోగి రూ. 37 వేలు ఆదా అవుతుంది. డ్రగ్ ఎల్యూటింగ్ స్టెంట్...ప్రస్తుతం దేశంలో ఎక్కువగా వినియోగిస్తున్న స్టెంట్లు ఇవే. ఇంకా చెప్పాలంటే హృద్రోగ సంబంధిత వ్యాధుల చికిత్సకుగాను 95 శాతం వీటినే వినియోగిస్తున్నారు. ఒకసారి శరీరంలో వీటిని అమర్చిన తరువాత రక్తనాళాల్లో మళ్లీ అడ్డంకులు ఏర్పడకుండా ఉండేందుకు వీటికి మందుపూత పూస్తారు. కొన్ని డ్రగ్స్ కూడా అంతర్భాగంగా ఉంటాయి. వీటికి ప్రస్తుతం రూ. 1,21 వేల వరకూ వసూలు చేస్తున్నారు. కేంద్ర ప్రభుత్వ ఆదేశాల మేరకు వీటి ధర ఇప్పుడు మార్కెట్‌లో 29,600గా నిర్ణయించారు. పన్నులతో కలిపితే ఈ స్టెంట్ల ధర రూ. 31,080 ఉంటుంది. అంతకు మించి ఉండకూడదు. దీని తయారీకి అయ్యే ఖర్చు రూ. 16,198. తాజా నిర్ణయంతో రోగికి ఈ స్టెంట్ కొనుగోలుతో రూ.90 వేల వరకు ఆదా అవుతుంది.

## రోగులకు రూ.4,450 కోట్ల మేర తగ్గనున్న భారం

స్టెంట్లను అతి చవకగా ఉత్పత్తి చేసి భారీ లాభాలకు అమ్మి రూ.కోట్లు గడిస్తున్న తయారీ దారులకు కేంద్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం అశనిపాతంలా తగిలింది. దేశవ్యాప్తంగా ఆసుపత్రుల్లో కరోనరీ స్టెంట్ల ధరలు భారీగా ఉండటంపై ఆందోళనలు పెల్లుబికాయి. ఈ ఆందోళనలకు ముగింపు పలకాలన్న ఉద్దేశ్యంతో కేంద్రం సామాన్య పేద రోగికి స్టెంట్ల ధరలను అందుబాటులోకి తీసుకు రావాలనే ఉద్దేశ్యంతో ఈ చర్యను చేపట్టింది. ప్రస్తుతం కంపెనీల వద్ద ఉన్న స్టెంట్ల నిల్వలకు కూడా సవరించిన ధరలను అమలు చేయాలనీ, ఒకవేళ రోగుల నుంచి ఎక్కువ వసూలు చేస్తే ఆసుపత్రులు, స్టెంట్ల సరఫరాదారులపై కఠిన చర్యలు తీసుకుంటామని కేంద్ర ప్రభుత్వం



హెచ్చరించింది. 'పలు ఆసుపత్రుల్లో కరోనరీ స్టెంట్ల ధరలు భారీగా ఉన్న విషయం మా దృష్టికి వచ్చింది. ఎంతో జాగ్రత్తగా ఆలోచించి వివిధ వర్గాల నుంచి అభిప్రాయాలు తీసుకున్న అనంతరం జాతీయ ఫార్మాస్యుటికల్ ధరల సంస్థ (ఎన్‌పిపిఏ) స్టెంట్ల గరిష్ట ధరలను నిర్ణయించింది' అని కేంద్ర మంత్రి అనంతకుమార్ స్పష్టం చేశారు. ఈ తగ్గింపుతో ఏడాదికి రూ. 4,450 కోట్ల మేర గుండె సంబంధిత రోగులపై భారం తగ్గుతుందన్నారు. స్టెంట్ల సరఫరాలోని వివిధ దశల్లో ఎక్కువ మొత్తం వసూలు చేస్తున్నట్లు కనుగొన్నామని ఎన్‌పీపీఏ పేర్కొంది. దీంతో రోగులు ఆర్థికంగా ఇబ్బందులు ఎదుర్కొంటున్నారనీ, వారికి ఊరట ఇచ్చేలా కరోనరీ స్టెంట్ల ధరల్ని తక్షణం సవరించాల్సిన అవసరం ఉందని తెలిపింది. ప్రభుత్వ ప్రకటనను దేశంలోని పలు వైద్య విభాగాలు ప్రశంసించాయి. కొన్ని ఆసుపత్రుల అనైతిక చర్యలకు ఈ నిర్ణయంతో చెక్ పెట్టారంటూ ఆలిండియా డ్రగ్ యాక్షన్ నెటవర్క్, డాక్టర్స్ ఆఫ్ ఎథికల్ హెల్త్‌కేర్‌లు ప్రశంసించాయి.


కలాం రాజు స్టెంట్

## తక్కువ ధర స్టెంట్ రూపశిల్పి-కలాం

వైద్య రంగ చరిత్రలో అతి తక్కువ ధరకే కరోనరీ స్టంట్ అందజేసిన ఘనత భారత దివంగత మాజీ రాష్ట్రపతి ఎపిజె అబ్దుల్ కలాంకే దక్కుతుంది. నిమ్స్‌లో నాటి హృద్రోగ నిపుణుడు డాక్టర్ సోమరాజుతో కలిసి డీఆర్డీవోలో ఆయన దీనిపై పరిశోధనలు చేశారు. అబ్దుల్ కలాం పరిశోధన విజయవంతం కాకముందు హృద్రోగులకు అమర్చే స్టెంట్ దేశంలో కేవలం ధనవంతులకు మాత్రమే అందుబాటులో ఉండేది.

డా.కలాం సోమరాజుతో కలిసి కొత్త రకం స్టెంట్‌కు రూపమిచ్చారు. పేదలకు రూ. 10 వేలకే అందించి, ఎంతో మంది పేదల జీవితాల్లో వెలుగులు నింపారు. ఇది కలాం-రాజు స్టెంట్‌గా ప్రాచుర్యం పొందింది. దీని కారణంగా వివిధ కంపెనీలు తమ స్టెంట్ రేట్లను తగ్గించుకోవాల్సి వచ్చింది. 1994 వరకు స్టెంట్‌లు విదేశాల నుంచి దిగుమతి చేసుకునే వారు. దీంతో ఒక్కొక్క స్టెంట్ ధర రూ. రెండు నుంచి మూడు లక్షల వరకు ఉండేది. కేర్ ఫౌండేషన్ సోమరాజుకు కలాంతో దాదాపు మూడు దశాబ్దాల స్నేహం ఉంది. తాను కలాం కలిసి చవకైన స్టెంట్ రూపొందించడానికి ఎంతో శ్రమించామనీ, తాము రూపొందించిన కొత్త రకం స్టెంట్ శరీరంలో అతి సులభంగా అమరుతుందని తమ పరిశోధన విజయవంతమైన సందర్భంగా డా.సోమరాజు వివరించారు.





## తయారీకి, విక్రయానికి భారీ వ్యత్యాసం

హృద్రోగ చికిత్సల నిమిత్తం వినియోగించే స్టెంట్ల ధరలు ఉత్పత్తిదారుని వద్ద నుంచి మార్కెట్‌కు అక్కడి నుంచి వినియోగ దారునికి చేరే వరకు ధరలలో భారీ వ్యత్యాసం కనిపిస్తోంది. ఉత్పత్తిదారుని వద్ద నుంచి రోగి వద్దకు వెళ్లే సరిగి స్టెంట్ల ధర ఆకాశానికి ఎగబాకుతోంది. స్టెంట్ల ఉత్పాదక ధర రూ. 40,820 ఉండగా, అది డిస్ట్రిబ్యూటర్ వద్దకు వచ్చే సరికి రూ. 1,01,000గా చేరుతోంది. ఆ ధర ఆసుపత్రి వద్ద రూ.1,70,000కు పెరిగిపోతున్నది. చివరకు వినియోగదారునికి అంటే రోగి వద్దకు చేరే సరికి ఆ ధర దాదాపు రూ. 2 లక్షలకు చేరుతున్నది. దీంతోనే హృద్రోగ వ్యాధుల బారిన పడ్డ రోగి అంత ధర చెల్లించే స్థోమత లేక చివరకు తన ప్రాణాలను కాపాడు కోవడానికి ఆస్తులను సైతం అమ్ముకుని స్టెంట్లను కొనుగోలు చేసి వేయించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. దీంతో లక్షలు పోసి స్టెంట్లను కొనుగోలు చేయలేని ఎంతో మంది ప్రతీ ఏటా ప్రాణాలు కోల్పోవాల్సిన దుస్థితి సైతం ఏర్పడుతున్నది. ఇవన్నీ గమనించిన కేంద్ర ప్రభుత్వం ఈమేరకు తీసుకున్న నిర్ణయంతో సామాన్య హృద్రోగులకు ఎంతో లబ్ది చేకూర్చినట్లయింది.

## స్టెంట్ల ధరల తగ్గింపుతో యాంజియోప్లాస్టీ ఖరీదు పెంపు

కేంద్ర ప్రభుత్వం స్టెంట్ల ధరల తగ్గింపుతో సామాన్య రోగికి లాభం చేకూరుతుందని సంతోషపడుతుంటే ఆ నష్టాన్ని పూడ్చుకోవడానికి వైద్యులు మరో ఎత్తు వేస్తున్నారు. యాంజియోప్లాస్టీ శస్త్ర చికిత్సలను ఖరీదైనవిగా మార్చేశారు. గతంలో యాంజియోప్లాస్టీ ఆపరేషన్లు చేసినందుకు గాను వైద్యులు రూ. 1.50 వేలు రోగి వద్ద నుంచి వసూలు చేస్తుండగా, ఇప్పుడు దానికి రూ. 2 లక్షలకు పెంచేశారు. అయితే, ఇందుకు వైద్యులు చెబుతున్న కారణాలు వేరే ఉన్నాయి.

యాంజియోప్లాస్టీ చేసేందుకు వినియోగించే థియేటర్ ఖర్చు, ఆ సమయంలో భారీ స్థాయిలో వినియోగించే విద్యుత్‌కు సంబంధించి చెల్లించే బిల్లులు, ప్రభుత్వానికి చెల్లించే పన్నులు ఈ మధ్య కాలంలో విరివిగా పెరిగిపోయాయనీ, ఈ కారణంగానే వైద్య చికిత్సల ఖర్చులను సైతం పెంచాల్సి వచ్చిందని కొందరు వైద్యులు పేర్కొంటున్నారు. అయితే, ప్రభుత్వ మార్గదర్శకాల ప్రకారం.. రోగి నుంచి ఏ విధమైన శస్త్ర చికిత్సకు సంబంధించిన బిల్లును వసూలు చేసినప్పటికీ వాటన్నింటినీ సవివరంగా రోగికి తెలియజేయాలని పేర్కొంటున్నారు.

ఏమైనా ఎందరో హృద్రోగుల గుండెలకు అండగా నిలిచి, వారికి ప్రాణంపోస్తోన్న స్టెంట్లు పేద హృద్రోగులకు సైతం అందుబాటులోకి రావటం ముదావహం.

# అరుదైన అనుభూతినిచ్చే 'ఆంద్రో' సందర్శనం!

సాధారణంగా నగరాల్లోని రమ్యమైన తావులు టూరిస్ట్‌లను త్వరగా ఆకట్టుకుంటాయి. అయితే మనదేశంలో గ్రామీణ వాతావరణంలోనూ ఎంతో సహజంగా పెంపొందిన టూరిస్ట్ ప్రాంతాలెన్నో ఉన్నాయి. యాత్రలపై ఆసక్తి ఉన్నవారు అలాంటివాటిపై కూడా దృష్టిపెడితే ఆ వైవిధ్యం ఎంతో కొత్తగా అనిపించి, యాత్రికుడికి అరుదైన అనుభూతినిస్తుంది. ఉదాహరణకు...



అందాల 'ఆంద్రో'

మణిపూర్‌లోని నాంగ్‌మైచింగ్ పర్వత పాదాల వద్ద గల అటవీప్రాంతంలో ఓ గ్రామం ఉంది. పేరు ఆంద్రో. 'ఆంద్రో' అనేది 'హంద్రో' నుంచి వచ్చిందని అంటారు. 'ఆంద్రో' అంటే తిరిగి వచ్చిన ప్రజల ఊరు' అని అర్థం. స్థానిక జానపద కథల ప్రకారం లోయిస్ (ఆంద్రో గ్రామంలోని అత్యధిక తెగప్రజ)లు ఎక్కడినుంచో వచ్చి తొలినాళ్లలో మణిపూర్‌లో స్థిపడ్డవారు. అయితే అక్కడి స్థానిక పాలకుడు వారిని తరిమేయగా, మళ్లీ కొంతకాలానికి వారు తిరిగివచ్చి అక్కడ స్థిరపడి 'ఆంద్రో'గా గుర్తింపుపొందారు.



'ఆంద్రో'లోని ట్రైబల్ మ్యూజియం

అక్కడి ప్రజలు ఎంతో ఆత్మీయంగా, అతిథిఅభ్యాగతులను ఆదరించేవారుగా ఉంటారు. అంతేకాదు చేతివృత్తులలో వారు అందెవేసిన చేయి. వారు కనుమరుగవుతున్న తమ సంప్రదాయాలను, ఆచారాలను పునరుద్ధించుకున్నారు. అందువల్లే 1993లో ప్రసిద్ధ ఆంథ్రోపాలజిస్టు, రచయిత అయిన మటువా బహదూర్ గైడెన్స్‌లో వారు గ్రామం నడిబొడ్డున కల్చరల్ కాంప్లెక్స్ కమ్ మ్యూజియంను నెలకొల్పుకున్నారు.

తమ తొలి మ్యూజియం క్యూరేటర్ ముటువ గౌరవార్థం ఆ మ్యూజియానికి 'ముటువ మ్యూజియం' అని పేరుపెట్టారు.

అందమైన పెయింటింగ్‌లు, చేత్తో తయారుచేసిన కొండజాతి బొమ్మలు ( ఈ బొమ్మలన్నీ మణిపూర్‌కు చెందిన 29 తెగల ప్రజల వస్త్రధారణను ప్రతిబింబించేవిగా ఉంటాయి), రాతి బొమ్మలు, స్థానిక ఇతిహాసాలను తెలిపే కొయ్య బొమ్మలు వగైరాలన్నీ సందర్శకులను ఆకర్షిస్తాయి.

ముఖ్యంగా అక్కడి పాటరీ సందర్శకుల మనసును దోచుకుంటుంది. కంబి, ఇషైపు, పుడాన్ మక్‌హాంగ్, యుక్‌హామ్, వాలమ్, నగాంగ్‌ఖ, వాంగ్‌ఖమ్..ఇలా రకరకాల పాటరీ ఉంటుంది. ఆంద్రో ప్రజలకు వ్యవసాయం ప్రధాన వృత్తికాగా, కళాత్మకమైన కుండల తయారీ ఉప వృత్తి.



మ్యూజియం బయట సందర్శకులు

ఆంద్రో పాటరీ ప్రత్యేకత ఏమిటంటే ఇక్కడి కళాకారులు పాటరీ తయరీకి కుమ్మరి చక్రానికి బదులుగా ఓ ప్రత్యేకమైన కొయ్యబ్యాట్‌ను ఉపయోగిస్తారు. ఆ తర్వాత వాటిని ఎండలో నాలుగురోజుల పాటు ఎండబెట్టి, ఆపైన కాలుస్తారు. అప్పుడు వాటికి స్థానికంగా చెట్లబెరడుల ద్వారా లభించే రంగులను వేసి, కొత్త కాంతులను జోడిస్తారు. ఇంకో విశేషమేమిటంటే ఆంద్రోలో పాటరీ తయారీకి అవివాహిత అమ్మాయిలను అనుమతించరు. కేవలం పెళ్లయిన మహిళలే అదికూడా తౌ చన్‌బ (వృత్తిని కేటాయించే తంతు) అనే సంప్రదాయ తంతు జరిపిన తర్వాతే ఈ పాటరీ పనిని చేయనిస్తారు.

ఆంద్రోలో తప్పనిసరిగా చూడవలసిన మరో ప్రదేశం చక్పా పనం నింగ్‌తౌ మెయితాపిరల్ షాంగ్లేన్ లేదా మీ ముటుబ. ఇదొక ప్రాచీన ఆలయం. గ్రామ దేవత పనమ్ నింగ్‌తౌకు చెందిన ఆలయమిది. ఇక్కడ పవిత్ర అగ్నిగుండం ఒకటి ఉంది. ఇది వెయేళ్ల కిందటినుంచి మండుతోందని చెపుతారు. 1వ శతాబ్దంలో ఖుమాన్ వంశ రాజైన పాయ్‌రిటన్ ఈ అగ్నిగుండాన్ని నెలకొల్పినట్లు చెపుతారు. మణిపురి నాగరికతలో ఇదొక చారిత్రక మలుపుగా విశ్వసిస్తారు. అప్పటినుంచే సంచారులైన వేటగాళ్లు అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకొని వ్యవసాయతెగగా అభివృద్ధిచెందారు.

స్వదేశీ మద్యాలైన సెక్‌మాయ్, ఆంద్రోలకు ఈ గ్రామం ప్రసిద్ధికెక్కింది. శతాబ్దాలుగా వస్తున్న మద్య తయారీ సంప్రదాయాన్ని ఇప్పటికీ గ్రామస్థులు కొనసాగిస్తున్నారు. ఈరెండిటి లో సెక్‌మాయ్ అత్యంత ప్రాచుర్యం పొందింది. స్థానికంగా దొరికే బియ్యం, యాంగ్లీ (స్థానికంగా ఉండే ఓ తీగచెట్టు) కాండాలతో ఈ మద్యాన్ని తయారుచేస్తారు.

ఇటీవలికాలంలో ఆంద్రో ప్రజలు టూరిజం పట్ల చైతన్యం పెంచుకున్నారు. తమ పరిసరాలను అందంగా ఉంచుతూ, ఎకో టూరిజంను వృద్ధిచేస్తున్నారు.

ఆంద్రో ప్రజలు అక్కడి పర్వతపాదాల వద్ద ఓ చక్కని రిజర్వాయర్‌ను ఏర్పాటుచేసుకున్నారు. దాని చుట్టూ ఓ ఉద్యానవనాన్ని పెంచి దానికి 'సాన్‌థీ నేచర్ పార్క్' అని పేరు పెట్టటమేకాదు, దీన్నొక పిక్‌నిక్ స్పాట్‌గా తీర్చిదిద్దారు. ■

# సాహిత్యంలో సరికొత్త ప్రశ్నలు!!

## సాహితీవనం



**మంచి కవిత్వం అంటే..ఇవాళ చీకట్లు కమ్ముకొంటున్న సంధ్యాకాశాన్ని చూస్తూ ఏడవడంకాక, రేపటి ఉజ్జ్వల ఉదయం కోసం ఉత్సాహంగా ఎదురుచూడడమేమో ఒక్కసారి ఆలోచించండి..!**

అలానే ఆలోచించడమేమిటి? .. హవ్వ.. యిదేమిటి..ఈ పద్ధతేమిటి!? ఈ తరహా ఎక్కడిదీ!?! మనం ఏంచేసినా.. సమాజంలో.. పోనీ సాహిత్యంలో.. ఏ ఒక్కరైనా సమర్థం చాలికదా..అంటారా..?

అందంగా ఒళ్లు విరుచుకునే వాక్యాలు, మొక్కకి సహజంగా మొలుచుకువచ్చే ఆకుల్లాంటి కొటేషన్లతో ఎత్తుగడ, కొనసాగింపు, ముగింపులో పట్టు సాధించినప్పుడే అది రక్తికట్టగలదంటారా..? పుస్తకం తెరిస్తే వేడి గాలి వీస్తుంది. పుటలు తిప్పితే నిప్పు రవ్వలు రాల్తాయి. ప్రతి పంక్తీ రక్తమంటిన ఒక ప్రసవం, నలిగిన గుండెల్లోంచి పెల్లుబికే రక్తగాత్రం కవిత్వమంటే..నిజమే అంటారా?!

సాయుధ పోరాటకాలంలో ఒకచేతిలో పెన్ను, మరో చేతిలో గన్ను పట్టి ఏకకాలంలో పాటను, పోరాటాన్ని ఒకేస్థాయిలో నడిపిన గొప్ప పోరాట కవుల మాటేమిటి!? మనుషుల్ని ఉమ్మడి లక్ష్యంవైపు నడిపించాల్సిన పరిజ్ఞానం వారిని విడగొడ్తున్న పరిణామాల వెనుక మార్కెట్ శక్తుల ప్రభావం అధికంగా ఉంది. ఈ శక్తులు తమ ప్రయోజనాల కోసం జనంలోంచి మనిషిని విడగొడ్తున్నాయి. వీటన్నింటినీ అధిగమించి నేటి సాహిత్యం జనహితం కోసం పాటుపడాలి. ఏమంటారు?!

సమకాలీన తెలుగు సమాజంలో కొన్ని కులసమూహాలు తమ కులగజ్జి, దురదను రాజకీయ, సామాజిక, సాంస్కృతిక వేదికలమీద, బహిరంగంగా గోక్కోవడం ద్వారా, అల్ప సంఖ్యాక కుల సమూహాలు కూడా తమతమ కులాల పట్ల ఉండక తప్పని దుస్థితిని కల్పిస్తున్నాయి. కాబట్టి ఈ తప్పు ఆ కులాలదేనా? ఆ వ్యాకుల సాహిత్యానిదా?! మరొకటిదా? అని చర్చించాల్సిన విషయం కాదంటారా?

సాధారణమైన పొడివచనం కవిత్వం కాదు. వచనానికి వచన కవిత్వానికి మధ్య వైరుధ్యాలున్నాయి. సిద్ధాంతం విషయ భావనని నిర్దేశిస్తే కవిత్వం దానికి ఆకర్షణనిచ్చి, సౌందర్యాత్మకం చేస్తుంది. ఏమంటారు?

కవిత్వం కళాతత్వం ఎలా ప్రతిఫలిస్తుంది? కళ ఏ రూపాల్లో నిర్మాణంలో భాగమౌతుంది? కళలోని తత్వాంశాలు చెబుతాయా? కవిత్వంలోని కళాదృక్పథాలకు కారకాలు ఇవేనా? అవి సౌందర్యం, ప్రతిభ, అభివృద్ధి స్థూలంగా చెబితే ప్రకృతి గతాంశం మొదటిదా? ఇది కళాదర్శనంలో జాగృతమవుతుందా?

ఆధునికత, సాంకేతికత మనిషి చూపులోని విశాలత్వాల్ని ఒకవిధంగా నాశనం చేస్తుందేమో? కవిత్వంలో రెండు ప్రధాన నిర్మాణ మార్గాలలో వస్తుముఖంగా ఒకటి ప్రపంచీకరణను తిరస్కరించేదైతే, రెండోది తాత్విక ధారని వ్యక్తంచేసేదా?

ఈ వైరుధ్యాలతో పాటు ఈ కవిత్వంలో వ్యక్తీకరణల అనుకలనం ఒక క్షేత్రం చుట్టూ తిరగడమే అంటారా? తత్వాలు మతాలుగా పరిణమిస్తాయా? తత్ఫలితంగా విగ్రహాలు వెలుస్తాయా? వెర్రితలలు వేస్తాయా? ఇలా మస్తిష్కంలో చెక్కుకోవలసిన అంశాలెన్నో ఉన్నాయంటే కాదంటారా?

ప్రతీకలు లేకుండా వాచ్యంగా చెబుతూనే సందేశాన్ని కవిత్వీకరించడం, వస్తునిర్మాణ వ్యూహాలను వివేచించే విమర్శకులకు మంచి అవకాశమా? సందర్భాన్ని బట్టి జన్మిస్తున్న వచనమాత్ర కవులకు కవిత్వ శిక్షణా శిబిరాలు ఏర్పాటుచేసుకోవాలంటారా? వెరసి సహ కవులకు తమను తాము చూసుకోగలిగే నిలువుటద్దం అవుతుందంటారా?

స్వీయాత్మకీ, వస్త్వాత్మకీ మధ్య ఉండే సెన్సిబిలిటీ, అనుబంధం డిసోసియేట్ అయిపోతుందా? ప్రతీక ప్రతీకతో ఘర్షించు కొంటూ ఒక కవితా సమూహాన్ని మొత్తంగా బంధించి ఉంచేలా ప్రయత్నిస్తుందా? వ్యక్తిగత చేతనను ఒక సాంఘిక సంస్కార చేతనగా మలుస్తూ స్వీయాత్మకీ వస్త్వాత్మకీ వాటిద్వారా అనుబంధమేర్పడేటట్లు చేస్తున్నాయా?

అద్భుతాలు, విప్లవాలు, సమ్మెలు, పైరవీలులేవు. డబ్బుతో ప్రమేయం లేకుండా జీవించిన ఒకతరం వారి ఆదర్శాలు, ఆత్మీయతలు, మాటపట్టింపులు, వాత్సల్యాలు మనల్నిప్పుడు ఆర్ద్రపరుస్తాయా? కళ్లు చెమ్మగిల్లేటట్లు చేస్తున్నాయా?

అన్ని సాహిత్య ప్రక్రియల్లోకి స్వీయ చరిత్ర రాయడం కష్టం. ఎందుకంటే తనను గురించి తను పొగడుకుంటే ఎబ్బెట్టుగా ఉంటుంది. అసలు స్వీయ చరిత్రలోని కథకుడికి తనను గురించి చెప్పుకునే స్థాయి, నిజాయితీ, చిత్తశుద్ధీ ఉండాలి.

అయితే కొంతమంది జాతీయ, అంతర్జాతీయ స్థాయి నాయకులు కాబట్టి వాళ్ల స్వీయచరిత్రకు చారిత్రక అంశాలతో ముడిపడి ఉండటంతో ఆసక్తిగా చదివింపచేస్తుంది. ఏమంటారు?

కవిత్వం అంటే 'బెస్ట్ వర్డ్స్ ఇన్ బెస్ట్ ఫార్మ్' అనీ, చెప్పవలసిన విషయాన్ని వేరేలా చెప్పి స్ఫురింపజేయాలనీ, మాటకి చరిత్ర, లయ, బరువు, తూకం ఉంటుందనీ, వాటిని తెలిసి వాడాలనీ, వాడిన మాటలు వాడిపోకుండా ఉండేవి ఉండాలనీ, మాటల్లో కొత్తదనం ఉండాలనీ, అతి తక్కువ కదలికలతో భావం వ్యక్తీకరించే గ్రేస్ కనిపింపచేయాలి అనుకోవడం మంచిదేనంటారా?!

చెప్తున్నట్లు కన్పిస్తున్న విషయం కంటే, చెప్పని విషయమే ఎక్కువ. అసలు చెప్పాలనుకున్నదానికీ, చెపుతున్నట్లు కన్పిస్తున్న దానికీ, చాలా వ్యతిరిక్తత ఉంటుంది. వాచకం ఒక రకంగా పాఠకుడ్ని మోసం చేస్తుంది. పాఠకుడు స్వీకరించగలిగే ఒకేఒక నిశ్చితార్థాన్ని భగ్నం చేస్తూ, ఏక కాలంలో అనేకానేక అర్థాల్ని సూచించగలదేమో ఆలోచించండి!

క్రమక్రమంగా కవిత్వాదరణ క్షీణావస్థకు చేరుకుంటుంటే రోజురోజుకూ పెరుగుతున్న కవులకూ, ఆవిష్కృతమవుతున్న కావ్యాల సంపుటులకు కొదవలేదు. అనుక్షణం అత్యధికం వెలువడుతున్నా మధ్యతరగతి పాఠకులు సాహితీ పఠనానికి, కవిత్వ పఠనానికి ఆసక్తి అంతగా చూపటం లేదనే చెప్పాలి. మౌనం ఎంతశక్తివంతమైన భాషో తెలిస్తే అంతగా సంక్షిప్తి ఎంత విస్తృతమైన అభివ్యక్తో అర్థం అవుతుంది. వివరణే విస్తృతం. నిజానికి ఏ సృజనలోనైనా మూలం చిన్నదే. సంక్షిప్తిలోని సౌలభ్యాన్ని సాహిత్యంలోని అన్ని యుగాల్లోనూ అన్ని భాషల్లోనూ చూడొచ్చేమో!!!

"తాము కొని, ఇతరులచేత కొనిపించగలిగితే కవుల కవిత్వం కనీసం బతుకుతుంది" అన్నమాటను కాదనగలమా? కవిత్వం ప్రజలకోసమే. కవిత్వం కూడా అందరూ పంచుకునే సమిష్టి ఆస్తి. ఆకలి ఎంత నిజమో, కవిత్వమూ అంతే కదా!!!

**-ఎస్.ఆర్. భల్లం**

## కృతి

# చక్కని సందేశమిచ్చే నవలిక



ఒకప్పుడు ఆడపిల్లను పరాధీన అనేవారు. విలువైన బంగారుపళ్లెంతోపోలుస్తూ, గోడచేర్పు లేనిదే ఆ బంగారుపళ్లెం తనకు తానై నిలువలేదు అనేవారు. ఇప్పుడు పరిస్థితులు మారాయని, ఆడపిల్లకూడా అవకాశం వస్తే సమాజం తన పాత భావ నిబంధనల్ని కాస్త సడలిస్తే, తనకుతాను నిలవటమేకాకుండా, తనచుట్టూ ఉన్నవారికి ఎంతగానో మేలుచేయగలుగుతుందని నిరూపించారు పోలంరాజు శారద తమ నవలిక 'బంగారు కంచం'లో. తన చుట్టూ ఉన్న అనుభవాల్ని, తన ఆలోచనల్ని రంగరించి మనముందుంచారు. చక్కని ఎత్తుగడ, భాషా సారళ్యత, కథాశిల్పం, పాఠకులను ఆకట్టుకుంటుంది. 'కాచీ' అని ముద్దుగా పిలవబడే కాత్యాయని ఓ సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబంలో తొలి సంతానం. బాల్యంలోనే వివాహమైన ఆమె అత్తగారి దౌష్ట్యానికి గురై తిరిగి పుట్టింటికి చేరుతుంది. ఇరుగు పొరుగు, నాయనమ్మ సూటిపోటి మాటల్ని సహిస్తూ, తను చదువుకుని, మంచి ఉద్యోగం సంపాదించుకుంటుంది. అటు తన మరుదులను, ఇటు తమ్ముళ్లను చక్కదిద్దుతూ వారి ప్రేమాభిమానానికి పాత్రురాలవుతుంది. తనకంటూ ఒక వ్యక్తిత్వం సంపాదించుకుని, అందరినీ ఎదిరించి, అత్తగారిని సమాధానపరిచి, తన కాపురం చక్కదిద్దుకుంటుంది. ఆత్మవిశ్వాసం ఉంటే అడ్డుగోడలన్నవి ఏమీ ఉండవని సందేశమిచ్చే ఈ నవలిక చదవతగ్గది.

**(బంగారు కంచం: పోలంరాజు శారద; వెల: 70 ప్రతులకు: అన్ని ప్రధాన పుస్తక కేంద్రాలు)**

-కూర చిదంబరం

# ఒకింత చైతన్యం..మరికొంత ప్రేరణ



మనసును కదిలించే, జడత్వంలోంచి, చేతనత్వంలోకి నడిపించే కథల్ని, అందునా స్త్రీ కోణంలోంచి జీవితాన్ని దర్శింపజేసే కథల్ని అందించే రచయిత్రి కొండవీటి సత్యవతి. 'కొన్ని మెరుపులు...కొన్ని ఉరుములు' కథా సంపుటి ఇందుకు నిదర్శనం. ఇందులో 32 కథలు న్నాయి. మచ్చుకు కొన్ని.. తొలికథ పాలపుంత'లో హెచ్ఐవి పాజిటివ్‌లయిన జంట .. జీవితాన్ని కన్నీళ్లతో నిరాశతో గడపకుండా మనోబలంతో హాయిగా సహజీవనం చేయటం. ఎంత స్ఫూర్తిదాయకం! 'ఊరేగింపు' కథలో ఖర్మ అను కుని కష్టాల్లో కూరుకుపోయిన నరసమ్మకు హితంచెప్పి, అండగా నిలిచే సంధ్య పాత్రను చక్కగా తీర్చిదిద్దారు. అలాగే 'మొగలిపూల పిల్ల' కథలో గీత, చిన్నారి రేణుకకు తానే చదువుచెప్పించాలనుకోవడం. 'మెలకువ సందర్భం'లో రమేష్, 'అపూర్వం' కథలో ప్రభాకర్ సగటు పురుషుడికి ప్రతీకలు. పెళ్లికిముందు ఆదర్శాలు వల్లించి, అనంతరం రూటు మార్చేయడం. అయితే 'మెలకువ సందర్భం'లో కథ ఆమె నిష్క్రమణ వరకే. 'అపూర్వం' లో ప్రభాకర్‌లో మార్పు, మారిన మనిషిని మన్నించే ఆలోచనలో చంద్ర.. 'కొత్తగాలి' చదివితీరాల్సిన మరో మంచికథ. అరవిందలా మారగలిగితే స్త్రీలకు మంచిరోజులే. 'కువాయట్ క్యాసెట్'లో పనికోసం కువైట్ వెళ్లిన వారి వ్యథ, గుండె చమరింపజేస్తుంది. ఇందులోని కథలన్నీ వేటికవి ప్రత్యేకమైనవే.

**(కొన్ని మెరుపులు..కొన్ని ఉరుములు...కొండవీటి సత్యవతి కథలు; వెల: రూ.250; ప్రతులకు: భూమిక, హెచ్.ఐ.జి. II, బ్లాక్ 8, ఫ్లాట్1, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-44)**

-జె.శ్యామల

# సమ్మోహితపరిచే కవిత్వం..



దీర్ఘ వాక్యాలతో, సుదీర్ఘ కవితలను కవిత్వాంశ సడలకుండా సృజించగల సుకవి యక్కలూరి శ్రీరాములు. ఈయన కవితా శీర్షికలు కూడా ఆ నిడివిలోనే వుంటై. యక్కలూరి ప్రేమమూర్తి. జీవితమంటే ప్రేమతత్వమే/ నాకు వ్యక్తిత్వమంటే కవిత్వమే' అన్న చిత్తశుద్ధి గల యక్కలూరి.. 'ప్రతి ఒక్కరి పరిష్కార నివేదన/ ప్రేమ ఒక్కటే శాశ్వత విమోచన' అని సూచించడమే కాదు ప్రేమ ఏకైక కాలాతీత శాశ్వత భావప్రాప్తని తెలిసింది' అంటూ తన అనుభవసారాన్ని మనముందుంచుతారు. ఈ కవికి ప్రకృతిలో విహరించడం యిష్టం. సమూహంలో సంచరిస్తూ తనదైన గొంతుతో ప్రతిధ్వనించడం మరీ యిష్టం. సమస్యను ఏకీకృతం చేస్తూ అక్షరాస్త్రాలు సంధించకపోతే పరిష్కారం లభించదు. కలేజా ఉన్న కవి ఎప్పుడూ ఒంటరే. 'సమూహంలోనైనా ఒంటరిగానే పయనిస్తాను/ ఒంటరిలోనూ సమూహామై ప్రవహిస్తాను/ కవి ఒక సామూహిక ఒంటరి అంటాను' అంటూ అనుక్షణం కవిత్వాన్ని శ్వాసించే కవికి జీవించే క్షణాలన్నీ/ అన్నీ..అన్నీ..కవితా వేళలే'.

రుషి వ్యాలి సోయగాలను వర్ణించినా, రైతువెతలకు జ్వలించిపోయినా..ఇలా ఏ వస్తువును కలానికెత్తుకున్నా తన పదబంధాలతో, భావవీచికలతో, తాత్వికాలోచనలతో కవితాప్రియులను సమ్మోహిత పరుస్తాడు. ఈ అనుభవం కావాలంటే గ్రంథాన్ని పఠించాల్సిందే.

**(కవి ఒక సామూహిక ఒంటరి: యక్కలూరి వై శ్రీరాములు; వెల: రూ.150; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తకకేంద్రాలు)**

-రమణ వెలమకన్ని

# మేలైన వ్యక్తిత్వ వికాస గ్రంథం



విమర్శ-ఆత్మవిమర్శ; సామాజికాంశాల్లో చైతన్య యుతంగా ఉండటం; సేవా దృక్పథం; కాలాన్ని సద్వినియోగం చేసుకోవడం; ప్రపంచీకరణ ప్రభావంతో మనదేశానికి దిగుమతి అయిన విషసంస్కృతి; దోపిడి; డబ్బే సర్వస్వం అనే ధోరణి; చెడుఅలవాట్లతో నలభై సంవత్సరాలకే వృద్ధాప్యం వచ్చే దుస్థితి; సామాజిక విలువలు వదులుకోవడం; విశృంఖలత; చెడు వ్యసనాలకు యువత బానిసలయ్యే స్థితిలో నుండి నీలో నిన్ను చూసుకో..నో దై సెల్ఫ్.అనే ధోరణికి యువతీయువకుల్ని ఆలోచింపజేసే విలువైన పుస్తకం తవ్వా వెంకటయ్య రచించిన 'యువతరం-నీలో నిన్ను చూసుకో'. వ్యక్తికి, వ్యక్తిత్వానికి మధ్య ఉన్న ఒక చిన్న విభజన రేఖ స్పష్టంగా అర్థం చేసుకొనేలా..ఈ గ్రంథంలో పలు అంశాలు చక్కగా విశ్లేషించారు. యుక్తవయసు-యువత- సమాజం, యువత-ఆశలు- ఆశయాలు-ఆందోళనలు; యువత-తల్లిదండ్రులు-యువత-లక్ష్యాలు; యువతరం-స్నేహం; ఈ తరం ప్రేమ..ఇలా ఏడు ప్రధాన అంశాలపై పరిశోధనాత్మకంగా ఈ గ్రంథాన్ని రచించారు. యువతీయువకులకు, వారి తల్లిదండ్రులకు, గురువులకు, ప్రేమికులకు, భార్యాభర్తలకు, గొప్ప విజయాల సాధనకై కృషిచేసే వారికి చక్కటి పుస్తకం ఇది. వ్యక్తిత్వ వికాస గ్రంథాల సరసన మరో మంచి పుస్తకాన్ని చేర్చారు.

**(యువతరం- నీలో నిన్ను చూసుకో...:డా.తవ్వా వెంకటయ్య; వెల: రూ. 150;ప్రతులకు: డా.తవ్వా వెంకటయ్య, తవ్వారుపల్లె గ్రామం, ఖాజీపేట మండలం, వై.యస్.ఆర్.కడపజిల్లా. ఆం.ప్ర.)**

-తంగిరాల చక్రవర్తి




# అభేద ప్రేమ..

కస్తూరి మురళీకృష్ణ

సూర్యోదయమవుతోంది.

సూర్యుడు ఇంకా నింగిపైకి రాకముందే సూర్యభగవానుడిని ఆహ్వానించేందుకు భూమి సిద్ధమౌతోంది. ఆకాశం అలకరించుకుంటోంది.

నల్లటి పాపాన్ని కడుగుకుని శుభ్రమవుతున్నట్టు ఆకాశం వెలుగురేకల పుణ్యంతో తెల్లనవుతోంది.

చైతన్యవంతమయిన పక్షితతులు ఆహ్వానగీతాలు పలుకుతున్నాయి.

జీవరాశులు సత్యాన్ని గ్రహించి చైతన్యవంతమయినట్టు సూర్యోదయమనే విజ్ఞాన వెలుగులను గ్రహించేందుకు సిద్ధమవుతున్నాయి.

అయితే ఈ ప్రపంచం దుఃఖమయ మని, దుఃఖానికి కోరికలు బీజమని, కోరికలను జయిస్తే దుఃఖం నశిస్తుందని ప్రవచించి ప్రపంచం నుంచి దుఃఖాన్ని నశింపజేసి ప్రజలకు సుఖశాంతులను ప్రసాదించాలన్న బుద్ధ భగవానుని ప్రవచనాలెంతగా ప్రజలను ప్రభావితం చేసినా, బౌద్ధం ఎంతగా ప్రజలలో విస్తరించినా ఇంకా ఈ ప్రపంచం నుంచి దుఃఖం తొలగలేదనేందుకు నిదర్శనంగా సూర్యోదయానికి ముందే అక్కడికి చేరుకుంటున్న ప్రజల సంఖ్య తెలుపుతోంది.

తమ కష్టాలు కరగిపోతాయని, దుఃఖాలు తొలగిపోతాయన్న గంపెడాశతో అక్కడకు చేరిన వారిని చూస్తూంటే ఈ ప్రపంచంలో ఎన్నెన్ని రకాల బాధలున్నాయో అర్థమవుతుంది. ఎన్నెన్ని కష్టాలతో మనుషులు సుఖానికి, సంతోషానికి ఆనందానికి దూరమౌతున్నారో తెలుస్తుంది.

వారంతో 'యెషెదావా' దర్శనం కోసం ఎదురుచూస్తున్నారు.

ప్రజలు ఆమెను బోధిసత్వుడి అవతారంగా భావిస్తున్నారు.

సాధారణంగా బోధిసత్వులు పురుషులే అయి ఉంటారు. ఇందుకు భిన్నంగా యెషెదావా 'మహిళా బోధిసత్వుడిగా భావిస్తున్నారు ప్రజలు.

ఆమె దర్శనంతోటే తమ దుఃఖాలు తొలగిపోతాయని నమ్ముతున్నారు.

అందుకే ఉదయం కాకముందునుంచే ఆమె దర్శనం కోసం పడిగాపులు కాస్తున్నారు.

సూర్యకిరణాలు భూమిని తాకటంతోటే ఆరామంలోని ఘంటిక మోగింది.

అక్కడున్న వారందరిలో కలకలం తగ్గింది. అంతా నిశ్శబ్దమై పోయారు.

సర్వజగత్తు సూర్యదర్శనం కోసం ఉద్విగ్నతతో ఎదురుచూస్తూంటే, సకల మానవాళి తమను దుఃఖం నుంచి విముక్తం చేసే బుద్ధ భగవానుని ప్రతిరూపం లాంటి 'యెషెదావా' దర్శనం కోసం ప్రశాంతచిత్తంతో ఎదురుచూడసాగారు.

*********

బుద్ధ భగవానుని మూర్తిని అర్చించింది యెషెదావా.

ఆమె బౌద్ధ భిక్షుకుల దుస్తులు ధరించింది. ఆకాలంలో బౌద్ధ భిక్షువులు పనికిరావని పారేసిన కాషాయ వస్త్రాలతో కుట్టిన వస్త్రాన్ని ధరించేవారు. అలా పారేసిన బట్ట ముక్కలను ప్రత్యేక పద్ధతిలో కుట్టేవారు. వారు ధరించే దుస్తులలో శరీరం కింది భాగాన్ని కప్పే బట్టను 'అంతర్వాసా' అంటారు. శరీరం పైభాగాన్ని కప్పే బట్టను 'ఉత్తరా సంగ' అంటారు. అయితే ఈ రెండు బట్టలను కప్పుతూ పైన ధరించే బట్టను 'సంఘాతి' అంటారు. ఈ మూడు బట్టలను కలిపి ధరించటాన్ని 'తిచీవర' అంటారు. ఆ పద్ధతి ప్రకారం దుస్తులు ధరించింది 'యెషెదావా'.

అంతేకాదు, బౌద్ధ భిక్షువుల లాగే 'శిరోముండనం కావించింది.

దాంతో ఆమె వదనంలో ఓ రకమైన ప్రశాంతత స్పష్టంగా కనిపిస్తోంది. అంతేకాదు. వెలుతురు ఆమె వదనంపై స్థిరపడ్డ భావన కలుగుతూ ఆమె దివ్యరోచిస్సులా ద్యోతకమవుతోంది.

అర్చన పద్ధతి ప్రకారం ముగించి, తన దర్శనం కోసం ఎదురుచూస్తున్న ప్రజలున్నవైపు నడిచింది.

ఆమె వస్తోందన్న సూచనగా గంట మోగింది.

తలుపు తెరచుకుంది.

ఆమె దర్శనమవుతూనే ప్రజల హృదయలోతుల్లోంచి దీర్ఘమైన నిట్టూర్పు నిశ్శబ్దంగా వెలువడింది.

ప్రకృతి ప్రశాంత చిత్త అయినట్టు నిశ్శబ్దమయిపోయింది.

ఆమెకు ప్రతిరోజూ ఇదే ఆశ్చర్యం అనిపిస్తుంది.

మనిషి ఆనందంకోసం జన్మించాడు. మనిషి సుఖంగా, శాంతంగా జీవించటం కోసం జన్మించాడు.

కానీ జీవితాంతం సుఖం వాంఛిస్తూ దుఃఖంలో కొట్టుమిట్టాడతాడు.

ప్రశాంత జీవనం వాంఛిస్తూ అశాంతి పాలవుతాడు. ఉన్నదానితో సంతృప్తి పడక లేనిదానికోసం వెంపర్లాడతాడు. ఉన్నది పోతుంది. లేనిది ఎలాగో రాదు.

ఆమెని చూస్తూనే ఎంతోమంది తమ బాధలను మరచిపోయారు.

వారి హృదయాలలోని బాధలను ఎవరో తోడేసి, ఆ ఖాళీ స్థానంలో ప్రేమను నింపిన భావన కలిగింది వారికి.

తమ ఎదురుగా ఉన్నది బౌద్ధ భిక్షువు కాదు, 'అమ్మ' అనిపించింది. 'విశ్వమాత' అనిపించింది.

ఒకరొకరుగా నిశ్శబ్దంగా కదలి వచ్చి ఆమె వస్త్రపుటంచును తాకి వెళ్తున్నారు.

ఎవరూ ఏమీ కోరటంలేదు.

ఎవరూ మౌనాన్ని భంగం చేయటంలేదు.

ఆమె దర్శనంతోటే వారి బాధలు ఆవిరైపోయాయి.

ఆమె వస్త్రాన్ని తాకటంతోటే వారి కోరికలు నశిస్తున్నాయి.

ఎంతో బాధతో వచ్చినవారు ప్రశాంతచిత్తులై వెళ్తున్నారు.

అలా వెళ్తున్న వారిని చూస్తూ బుద్ధ భగవానుడిని ధ్యానిస్తూ నిలుచుంది 'యెషెదావ'.

**********

యెషెదావాను కలవాలని బహుదూరం నుంచి వచ్చిన బౌద్ధ పండితులు, భిక్షువులు వారు.

బౌద్ధ ధర్మంలో నిష్ణాతులు వారు. పరివ్రాజకులు.

బౌద్ధానికి సంబంధించిన నియమనిబంధనలను ఏర్పాటుచేసి బౌద్ధ ధర్మ విస్తరణకు, ధర్మపాలనకు వారు సంఘంలా ఏర్పడి కృషిచేస్తున్నారు.

వారంతా 'యెషెదావా' గురించి విన్నారు. ఆమెను కలవాలని వచ్చారు.

ప్రజలకు దర్శనం ఇచ్చిన తరువాత, ఆమె ప్రశాంతంగా ఉన్నప్పుడు తాము ఆమెని కలవాలని వచ్చినట్టు కబురుపంపారు.

ఆమె వెంటనే వారిని సాదరంగా ఆహ్వానించింది.

అయితే ఆమె వారిని ఎంతగా ఆదరిస్తోందో, ఎంతగా వారిపై ప్రేమ కురిపిస్తోందో వారి ముఖాలు అంతగా గంభీరంగా ఉన్నాయి.

తన పట్ల వారు ప్రసన్నంగా లేరని ఆమె గ్రహించింది.

అయితే ఆ విషయం ఆమె ప్రస్తావించలేదు. వారు ప్రస్తావించేంత వరకూ ఆగింది.

'తమరిని తాము బోధిసత్త్వుడి అవతారంగా భావిస్తున్నారా?' వారిలో ఒక పండితుడు సూటిగా అడిగాడు.

అతడివైపు ఆమె ప్రశాంతంగా చూసింది. 'లేదు' అంది శాంతంగా.

'ప్రజలు తమరిని బోధిసత్త్వుడి అవతారంగా భావిస్తున్నారు. ఆ అభిప్రాయాన్ని తప్పని నిరూపించేందుకు ఎలాంటి ప్రయత్నం ఎందుకు చేయటంలేదు?

'ఈ ప్రపంచం అంతా మాయ.. శూన్యం. దాన్లో అపోహలు, దురూహలు కూడా శూన్యమే. శూన్యం గురించి బాధపడటం ఎందుకు? ప్రజలు ఏదో ఆవేశంలో అలా అనుకుంటుండవచ్చు. ఆవేశం తగ్గిన తరువాత నిజం గ్రహిస్తారు'.

'అయితే నిన్ను నువ్వు బోధిసత్త్వుడి అవతారంగా భావించటం లేదా?'

విస్మయంగా వారివైపు చూసింది. 'నేను అలా భావిస్తున్నానని మీరు అనుకుంటున్నారా?' సూటిగా అడిగింది.

'మరి వారికి దర్శనం ఇవ్వటం ఎందుకు? వస్త్రాన్ని తాకే అనుమతి ఇవ్వటం ఎందుకు?'

ప్రశాంతంగా నవ్వింది యెషెదావా.

'మీకు నేను దర్శనం ఇవ్వటంలో అహంకారం కనిపించిందా? నేను బుద్ధ భగవానుడి అంశనన్న భావం కనిపించిందా?

వారు మాట్లాడలేదు. కాస్సేపటికి ఆమే అంది.

'విజ్ఞానం, ఓపిక, ఏకాగ్రత, దయ వంటి లక్షణాలు ఎన్ని ఉన్నా ముక్తి పొందే అర్హత లభించాలంటే ప్రేమ ఉండాలి. ప్రేమ అంటే మామూలు వస్తుగత ప్రేమకాదు. బంధాలు విధించే ప్రేమకాదు. బంధనాలు తుంచే ప్రేమ. పరిమితమైన ప్రేమకాదు. సకల జీవరాశులపైని ప్రేమ. అలాంటి ప్రేమ జాగృతమైనపుడు ప్రజల దుఃఖం చూడటం సాధ్యంకాదు. వారి అమాయకత్వం, వారి అజ్ఞానం, వారి బాధలు జాలి కలిగిస్తాయి. అది మనం వారికంటే అధికులం అన్న భావంతో కలిగే జాలికాదు. జన్మ పరంపరలో సుఖదుఃఖాలు అనుభవిస్తూ, జ్ఞానం, అజ్ఞానం నడుమ కొట్టుమిట్టాడుతూ సంపూర్ణ విజ్ఞానం గ్రహించి బుద్ధ భగవానుడి స్థాయికి చేరుకునేందుకు జీవి పడుతున్న తపన, జరుపుతున్న పోరాటం, చూస్తున్నప్పుడు మనసు లోలోతుల్లోంచి పొంగిపొర్లే ప్రేమ భావన అది. పసిపిల్లలు తల్లివైపు పాక్కుంటూ వస్తారు. తల్లిని

'నిర్వాణం పురుష శరీరానికి పరిమితమని భావించటం తప్పు. స్త్రీ, పురుషులు వేర్వేరని, స్త్రీ శరీరానికి విజ్ఞాన స్వీకరణలో పరిమితు లున్నాయని భావించటం అజ్ఞానం. ఇది మాయ. ప్రపంచంలోని ప్రజలందరూ ఈ భ్రాంతి నుంచి వెలికి వచ్చేవరకూ, ఈ అపోహలను, అజ్ఞానాన్ని వదలుకునే వరకూ నేను స్త్రీ జన్మలు ఎత్తుతాను. స్త్రీగానే నిర్వాణం పొందుతాను. పురుషుడు స్త్రీకన్నా అధికుడు అన్న భావన భ్రాంతే. అది అజ్ఞానం. స్త్రీ, పురుషుల నడుమ తేడాలేదు. ఒకే పదార్థానికి రెండు వేర్వేరు రూపులు వారు. ఇది గ్రహించటమే అసలు విజ్ఞానం. ఇదే ప్రేమ. ఈ ప్రేమ భావనను గ్రహించని వారికి ఎన్నడు మోక్షంరాదు' అందామె.

చూడగానే సర్వం మరచి నవ్వులు చిందిస్తారు. నన్ను చూసి ప్రజలు అలాంటి ఆనందం పొందుతున్నారు. ఇది అశాశ్వతమైన ఆనందం. కానీ శాశ్వత ఆనంద సాధనకు ఇది మెట్టు. అందుకని వారి ఆనందాన్ని నేను కాదనటంలేదు. అదీగాక, బుద్ధ భగవానుని బోధలను సులభంగా అందుకునేందుకు వారు మానసికంగా సిద్ధమవుతూంటే నేనెవరు కాదనటానికి?'

ఆమె మాటల ప్రవాహంలో కొట్టుకుపోయారు వారు.

ఆమెను చూస్తూంటే వారిలోనూ ప్రశాంత సాగర కెరటాలు ఎగిసిపడుతున్నాయి. మనసు ఆనంద పరవశమవుతున్నది.

ప్రపంచంలోని దుఃఖమంతా పారిపోతున్న భావన కలుగుతోంది.

ఆమెను చూస్తూంటే ప్రపంచంలోని బాధలు, కోరికలు, ఆవేదనలు, అర్థవిహీనం అనిపిస్తున్నాయి. ఎంతో చిన్నవి అనిపిస్తున్నాయి.

ఆమె ముందు మోకరిల్లాలన్న భావన వారందరికీ బలంగా కలుగుతోంది.

బుద్ధభగవానుని బోధనలను సంపూర్ణంగా ఆకళింపు చేసుకుని, ప్రచారం చేస్తూ వాటిల్లోని సందేహాలను తీర్చేవారు వారు. వారికే ఆమె దర్శనం ఇలాంటి భావనలు కలిగిస్తూంటే ఇక సామాన్యుల సంగతి చెప్పటం కష్టం కాదు.

తమని తాము కూడదీసుకుని, అన్నారు వారు..

'అమ్మా..తమరు సంపూర్ణ జ్ఞానాన్ని దాదాపుగా సంగ్రహించిన వారు. కానీ స్త్రీ శరీరం మీరు బోధిసత్త్వుడిగా ఎదగటానికి ప్రతిబంధకంగా తోస్తోంది. మీరు వచ్చే జన్మలోనైనా కనీసం పురుష జన్మ లభించాలని కోరుకోండి, బుద్ధిపథం చేరుతారు'.

ఆమె వారివైపు ప్రశాంతంగా చూసింది.

'నిర్వాణం పురుష శరీరానికి పరిమితమని భావించటం తప్పు. స్త్రీ, పురుషులు వేర్వేరని, స్త్రీ శరీరానికి విజ్ఞాన స్వీకరణలో పరిమితు లున్నాయని భావించటం అజ్ఞానం. ఇది మాయ. ప్రపంచంలోని ప్రజలందరూ ఈ భ్రాంతి నుంచి వెలికి వచ్చేవరకూ, ఈ అపోహలను, అజ్ఞానాన్ని వదలుకునే వరకూ నేను స్త్రీ జన్మలు ఎత్తుతాను. స్త్రీగానే నిర్వాణం పొందుతాను. పురుషుడు స్త్రీకన్నా అధికుడు అన్న భావన భ్రాంతే. అది అజ్ఞానం. స్త్రీ, పురుషుల నడుమ తేడాలేదు. ఒకే పదార్థానికి రెండు వేర్వేరు రూపులు వారు. ఇది గ్రహించటమే అసలు విజ్ఞానం. ఇదే ప్రేమ. ఈ ప్రేమ భావనను గ్రహించని వారికి ఎన్నడూ మోక్షంరాదు' అందామె.

వారంతా ఆమె ముందు మోకరిల్లారు. ఆమె వస్త్రాన్ని తాకి మౌనంగా బయటకు నడిచారు.

**********

'యెషెదావా' అంటే 'విజ్ఞానవంతమయిన చంద్రుడు' అని అర్థం.

మోక్షం పొందిన 'యెషెదావా', 'తార'లా పరిగణనకు గురయింది.

టిబెట్టులోని బౌద్ధులు పాటించే వజ్రయాన బౌద్ధంలో తారను మహిళా బుద్ధుడిగా కొలుస్తారు. ' జెట్సున్ దోల్మా' అని పిలుస్తారు. జపాన్‌లో 'తారా బోసాత్సు', చైనాలో 'ద్యోలోపూసా'గా భావించే తార ప్రపంచవ్యాప్తంగా బౌద్ధంలో పలురూపాలలో పూజలందుకొంటోంది. స్త్రీ, పురుషుల అభేద ప్రతిపత్తిని ప్రపంచానికి బోధిస్తోంది. ప్రేమ స్వరూపాన్ని విప్పి చెప్తోంది.



## చుక్కలు కలపండి



## రంగులు వేయండి



# ప్రయత్నం మానకు

కథ

గోపరాజుకి ఓ ఎకరం భూమి ఉంది. దానికి నీటి వసతి లేదు. వానలు రాక, నీటి వసతి లేక, పంటలు పండటంలేదు. పొలంలో అక్కడక్కడా రాళ్లతో పచ్చదనంలేక బంజరు భూమిలాగా కనబడ సాగింది. ఏది ఏమైనా పొలంలో ఒక బావి తవ్వించి తన అదృష్టాన్ని పరిశీలించుకోవాలనుకొన్నాడు. కూలీలను పెట్టించి గోపరాజు బావిని తవ్వించసాగాడు. నూట ఇరవై అడుగులు తవ్వినా నీళ్లు పడలేదు, సరికదా మట్టి, నీరు జాడలేదు, రాయి ఉన్నట్టు తేలింది. ఇక లేనిపోని ఖర్చు ఎందుకు అని ఆ ఎకరం భూమిని అమ్మి వేయాలని నిర్ణయించుకొన్నాడు. తనకు పరిచయం ఉన్న డబ్బుగల నారాయణవద్దకు వెళ్లి తన భూమి సంగతి చెప్పి అమ్మేద్దామనుకొంటున్నట్టు చెప్పాడు.



నీళ్లు లేవు, కాలువ వసతి లేదు కనుక నారాయణ బేరమాడి ఆ ఎకరాను మూడువేల రూపాయలకే కొనుక్కొన్నాడు. పొలానికి వెళ్లి చూస్తే తవ్వి వదిలేసిన బావి కనబడింది. ఏదిఏమైనా ఆ తవ్విన బావిని మరింత తవ్వించి చూద్దామని నారాయణ నిర్ణయించుకొన్నాడు. ఆ రోజే కూలీలను పెట్టి, బావిలోని రాయిని పగుల గొట్టించాడు. పగిలిన రాయిని లేపి వేయగా రాళ్లకిందనుండి నీటి ఊట తన్నుకువచ్చింది. నారాయణ సంతోషించాడు. నీరు పుష్కలంగా పడింది కాబట్టి నారాయణ పొలాన్ని దున్నించి విత్తనాలు చల్లించాడు.

ఈ విషయం గోపరాజుకి తెలిసింది. గోపరాజు నారాయణను కలిసి "నేను కష్టపడి బావి తవ్వించాను. కానీ నీవు ఆ కొద్దిగా తవ్విస్తే నీళ్లు పడ్డాయి. అంతమంచి భూమి నీకు మూడు వేలకే అమ్మాను. కాబట్టి నాకు మరో రెండువేలన్నా ఇవ్వు" అన్నాడు.

"నిజమే. నీవు తవ్వించి పూర్తిగా ప్రయత్నించకుండా భూమిని నాకు అమ్మావు. ఇప్పుడు ఆ భూమ్మీద అన్ని హక్కులూ నావే, రాళ్లుపడినా, బంగారం దొరికినా నాదే" అన్నాడు.

"నారాయణా! నాకు రెండు వేలు ఇవ్వక పోతే గ్రామాధికారికి నీమీద ఫిర్యాదు చేస్తాను" అన్నాడు గోపరాజు.

"ఫిర్యాదు చెయ్యి. న్యాయం ఎవరివైపు ఉందో చూద్దాం" అన్నాడు నారాయణ.

అనుకున్నట్టుగానే గ్రామాధికారి దగ్గర గోపరాజు, నారాయణపై ఫిర్యాదుచేశాడు. ఊరిపెద్దల్ని కూడా పిలిపించాడు.

గోపరాజు తన వాదన వినిపించాడు.

ఆ తర్వాత నారాయణ నవ్వుతూ "నిజమే, బావి తవ్వించి, నీళ్లు పడకపోయేసరికి, భూమి పనికి రానిదని తక్కువధరకే నాకు అమ్మాడు. అతను అంతలోతు తవ్విన బావిని నేను నా అదృష్టాన్ని పరీక్షించుకొనేందుకు తవ్విస్తే నీళ్లుపడ్డాయి.







వార్త ఆదివారం

భూమి నాకు అమ్మాడు కనుక, దానిమీద సర్వహక్కులు నావే. మీరే చెప్పండి, గోపరాజుకి ఇప్పుడు నేను రెండు వేలు ఎందుకివ్వాలి?" అన్నాడు నారాయణ.

"నారాయణ చెప్పింది నిజమే. నీకు పనికిరాదనుకొనే భూమిని అతనికి అమ్మావు.. ఇప్పుడు మళ్లీ మరికొంత డబ్బు ఆశించడం తప్పు కదా" అడిగాడు గ్రామాధికారి.

గోపరాజుకి ఏంచెప్పాలో తెలియక నేలకేసి చూశాడు. అప్పుడు నారాయణ, గోపరాజు భుజంతట్టి ఇలా అన్నాడు.."చూడు గోపరాజూ! నీకష్టం నాకు తెలుసు. ఊళ్లో అందరికీ తెలియాలనే పెద్దల్ని కూడా పిలిపించాను. నువ్వు బావి అంత లోతు తవ్వావు. కష్టమో, సుఖమో మరింత తవ్వించి ఉంటే నీళ్లుపడి నీ బంజరు భూమి బంగారు భూమి అయ్యేది. కానీ నువ్వు నిస్పృహతో చివరిక్షణంలో బావితవ్వకం ఆపివేశావు. ఏ పని మొదలుపెట్టినా, దాన్ని మధ్యలో వదలివేయకుండా కృషిచేసి సాధించాలి, లేదా నిపుణుల సలహా తీసుకోవాలి. ఈ విషయం నీకు, ఊరివాళ్లకు తెలియాలనే పంచాయితీ పెట్టించాను. నువ్వు, నన్ను రెండువేలు అడిగావు. కానీ నేను ఆలోచించి మూడువేలు ఇస్తున్నాను. నీ మిగతాభూమిని బాగు చేసుకో" అంటూ డబ్బు ఇచ్చాడు.

నారాయణ మంచిమనసుకి గ్రామాధికారితో సహా అంతా చప్పట్లు కొట్టారు. నారాయణ మాటల్లోని సూక్ష్మాన్ని గ్రహించారు. అప్పటి నుండి నారాయణ, గోపరాజు అభివృద్ధికి తోడ్పడుతూ ఊళ్లో మరింత మంచిపేరు తెచ్చుకున్నాడు.

-కంచనపల్లి వేంకట కృష్ణారావు

## హలో ఫ్రెండ్...



**చిన్నారుల ప్రశ్నలకు**

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

### గిరీష్ అంకుల్ సమాధానాలు

**కె.నరేష్‌కుమార్, వరంగల్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. మనిషి ఆరోగ్యానికి మంచినీటికి గల సంబంధాన్ని, నీటి ప్రాముఖ్యాన్ని దయచేసి వివరించండి.**

**జవాబు:** నరేష్ కుమార్! మానవ శరీరం కూడా ఒక యంత్రం వంటిదే. మామూలుగా ఒక కారు పెట్రోలు లేదా, గ్యాస్ లేనిదే ఎలా నడవలేదో, నీళ్ల లేనిదే మానవశరీరం సక్రమంగా పనిచేయలేదు. మనిషి ఆహారం లేకపోయినా ఉండగలడేమో కానీ నీళ్ల తాగకుండా ఉండలేడు. శరీరంలో 1 శాతం నీరు తగ్గగానే ఆ వ్యక్తికి దాహంవేస్తుంది. అదే 10శాతం నీరు తగ్గితే ఆ వ్యక్తి మరణిస్తాడు. మనిషి శరీర బరువులో మూడింట రెండువంతులు నీరే ఉంటుంది. మనిషి మెదడు 95శాతం నీటితో నిండి ఉంటుంది. రక్తంలో 82శాతం, ఊపిరి తిత్తుల్లో 90శాతం నీరు ఉంటుంది. నిజానికి శరీరంలోని కణజాలం, అవయవాల పనితీరు మనిషి తీసుకునే నీటి పరిమాణంపైనే ఆధారపడుతుంది. శరీరంలో 2శాతం నీరు తగ్గితే డీహైడ్రేషన్‌కు దారితీస్తుంది. డీహైడ్రేషన్ అనేక రుగ్మతలకు దారితీస్తుంది. ఆహారం జీర్ణంకావటానికి నీరు ఎంతగానో తోడ్పడుతుంది. నీరు మనిషి శరీర ఉష్ణోగ్రతను కూడా క్రమబద్ధం చేస్తుంది. మంచినీళ్ల ఎక్కువగా తాగడం ఆరోగ్యానికి ఎంతో మంచిది. నీళ్ల సమృద్ధిగా తాగటం వల్ల రక్తపోటు, కొలెస్ట్రాల్ కూడా అదుపులో ఉంటాయి. పరిశుద్ధమైన నీరు తీసుకుంటే జలుబు, దగ్గులను నివారించవచ్చు. పైన డీహైడ్రేషన్ గురించి చెప్పుకున్నాం కదా. డీహైడ్రేషన్ వల్ల జ్ఞాపకశక్తి తగ్గిపోతుంది. లెక్కలు సులభంగా చేయలేరు. చిన్న అక్షరాలను చదవటం, కంప్యూటర్ స్క్రీన్‌ను చూడటం కూడా ఇబ్బందిగా ఉంటుంది. పగటివేళ ఎక్కువ అలసటగా అనిపించడానికి కారణం స్వల్పస్థాయిలో డీహైడ్రేషనే. అందువల్ల నీళ్ల ఎక్కువగా తాగుతూ ఆరోగ్యాన్ని పరిరక్షించుకోవాలి. అందులోనూ వేసవిలో నీళ్ల మరింత ఎక్కువగా తాగవలసి ఉంటుంది.

**డి.అలేఖ్య, విజయవాడ.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను. నాకు ఎప్పుడూ మార్కులు 60శాతం వరకు వస్తుంటాయి. అమ్మ ఇంకా బాగా రావాలంటుంది. 60 శాతం మార్కులు మంచి మార్కులు కావా? మీరైనా చెప్పండి.**

**జవాబు:** అలేఖ్యా! 60శాతం మార్కులు రావటం మెచ్చదగ్గ విషయమే. కానీ నేటికాలంలోని పోటీ దృష్ట్యా ఇంకా ఎక్కువ మార్కులు తెచ్చుకునే ప్రయత్నం చెయ్యాలి. ఇంకొంచెం కష్టపడితే నీ మార్కుల శాతం తప్పకుండా మెరుగుపడుతుంది. పట్టుదలతో ప్రయత్నించు.



# భిన్నమైన ఆలోచన.. ఆకాంక్ష!

పర్యావరణం గురించి ప్రతిక్షణం ఆలోచించాల్సిన నేపథ్యంలో విలువైన, అరుదైన కలప గురించిన ఆలోచనలు వస్తాయి. కలప కోసం చెట్లను నరకడం, చెట్లు తగ్గడంతో పర్యావరణం దెబ్బతినడం, ఒకవేళ కొత్త చెట్లు నాటినా, అవి వృక్షాలవటానికి దీర్ఘకాలం పడుతుంది కాబట్టి గ్యాప్ పెరిగి, పర్యావరణం త్వరితంగా కోలుకోవటం కష్టమే. అందుకే తక్కువ ఖర్చుతో పర్యావరణ హితమైన కలప ప్రత్యామ్నాయాలను కనుగొనవలసిన అవసర మేర్పడింది. ఈ దిశగా కృషి జరుగుతోంది. ఇందులో భాగంగానే బిస్మన్ డియు అనే పదిహేనేళ్ల బాలిక కొత్తరకం కలపను కనుగొంది. వరిపొట్టునుంచి కొత్తరకం కలపను రూపొందించింది బిస్మన్. బిస్మన్ చండీఘడ్ అమ్మాయి. స్కూలుకు వెళ్లే ఓ టీనేజర్ ఇంత గొప్ప ఆవిష్కరణ చేయడంతో అందరి దృష్టి ఆమెకేసి తిరిగింది. భారత్‌లో పుట్టిన బిస్మన్ కొన్నేళ్లు తల్లిదండ్రులతో పాటు ఇంగ్లండ్‌లో గడిపింది. చండీఘడ్‌లోని స్ట్రాబెర్రీ ఫీల్డ్స్ హైస్కూల్‌లో చదువుకున్న బిస్మన్ ప్రస్తుతం ఇంగ్లండ్‌లోని యూనివర్సిటీ ఆఫ్ వార్‌విక్‌లో ఎకనమిక్స్, పాలిటిక్స్, ఇంటర్నేషనల్ స్టడీస్ సబ్జెక్టులను చదువుతోంది.



తను కనుగొన్న కొత్తరకం కలప గురించి చెపుతూ ఆమె.."మాకు ఉత్తర భారత్‌లో ఉన్న పొలం‌ఉంది. అందులో మావాళ్లు గోధుమ, వరి పండిస్తారు. పంట నూర్పిడుల కాలంలో కాలుష్యం కూడా పెరుగు తుంది. కారణం.. వరితాలూకు పొట్టు, ఎండుగడ్డిలను రైతులు కాలుస్తుంటా రు. దాంతో వాయు కాలుష్యం ఎక్కు వవుతుంది. నాకు బాగా జ్ఞాపకం.. సాయంత్రాలలో మా నాన్నతో నడిచివెళ్తుంటే నల్లటి అతిపెద్ద పొగవలయాలుగా చుట్టేసేది.. ఫలితంగా ఉక్కిరిబిక్కిరై దగ్గు వచ్చేది. బాల్యం నుంచి నాకు ప్రతి అంశంలోనూ ఇలా ఎందుకు అనే ప్రశ్న తలెత్తేది. ఆ కుతూహలమే నన్ను వరిపొట్టు, వరిగడ్డిల గురించిన పరిశోధనవైపు నడిపించింది. మా ఇంటి వంటిల్లే నాకు ప్రయోగ శాల అయింది, ఫలితంగానే 'గ్రీన్ ఉడ్' అవతరించింది' అందామె.




బిస్మన్, వరిపొట్టును రెజిన్‌తో కలిపి, ఆ మిశ్రమాన్ని కంప్రెస్ చేసి పార్టికల్ బోర్డులుగా చేసి, రీసైకిల్డ్ ఉడ్ ప్రోటోటైప్‌ను తయారు చేసింది. ఆమె ఆవిష్కరణ ఆమెకు 2015లో యూనిసెఫ్‌వారి 'స్టేట్ ఆఫ్ ది వరల్డ్స్ చిల్డ్రన్ రిపోర్ట్'లో చోటు కల్పించింది. పరిశోధన, కొత్త అంశాల ఆవిష్కరణలపట్ల స్కూలు పిల్లలను ప్రోత్సహించడానికి సోషల్ ఇన్నొవేషన్ రిలే సంస్థ అందించే బహుమతిని బిస్మన్ గెలుచుకుంది. గ్రీన ఉడ్‌పై తన పరిశోధనను బిస్మన్ ఇంకా కొనసాగిస్తోంది. దీనివల్ల భవిష్యత్తులో ప్రజలకు తక్కువ వ్యయం తో నిర్మాణ సామగ్రిని అందించవచ్చును కుంటున్నానంటోం దామె. 'గ్రీన్ ఉడ్' ద్వారా అసంఖ్యాకప్రజలో మార్పు తేవాలన్నది నాకోరిక' అంటుందామె.

ఇప్పుడు బిస్మన్ తన సమయాన్ని చదువుకు, విద్యార్థులను..ముఖ్యంగా అమ్మాయిలను పారిశ్రామికవేత్తలను చేయడానికి కేటాయించుకుంది. అందుకు బిస్మన్ 'కలర్ ది వరల్డ్ పింక్' పేరిట ప్రచారం చేపట్టింది. తద్వారా అమ్మాయిలు నాయకత్వ లక్షణాలు పుణికిపుచ్చుకొని విజయానికి సొంత ప్రణాళిక రచించుకుంటారు. ప్రపంచవ్యాప్తంగా కార్పొరేట్ రంగంలో మహిళలు ఎక్కువగా కనపడకపోవడ మన్నది పెద్ద సమస్య అంటుందామె. ప్రచారంలో భాగంగా బిస్మన్ పాఠశాలలకు వెళ్లి అక్కడి విద్యార్థులను కలిసి, మాట్లాడి, తన అనుభవాన్ని వివరించి, వారు కూడా తమదైన పరిశోధనలకు పూనుకోవటానికి ప్రోత్సహిస్తోంది. ఇటీవల ఆమె 'బ్లూ ఓషన్ టెక్నాలజీ' వారితో కలిసి ఓ ఈవెంట్‌ను నిర్వహించారు. అందులో బిజినెస్ నిర్వహించుకోవడానికి అవసరమైన నైపుణ్యాల గురించి ప్రసంగాలు ఇప్పించారు. మహిళలకు ఏనాటి నుంచో ఉన్న స్టీరియోటైప్ కెరీర్లు కాకుండా లింగవివక్ష లేకుండా సరికొత్త రంగాలలో మహిళలు దూసుకెళ్లేలా చేయాలన్నదే బిస్మన్ లక్ష్యం.

'గతంలో చాలావరకు అమ్మాయిలను వైద్యరంగం లేదా అమ్మాయి లకు అనుకూలంగా ఉంటాయని భావించే రంగాలలో ప్రోత్సహించే వారు. పారిశ్రామికవేత్తల పని బాధ్యతలు 9-5 గంటలకే పరిమిత మవుతాయని చెప్పలేం. అలాగే డబ్బు అనంతంగా లభిస్తుందనీ చెప్పలేం. అయినప్పటికీ నా దృష్టిలో ఏ అమ్మాయికీ కార్పొరేట్ రంగానికి పనికిరావని చెప్పకూడదు. చిన్న వయసు నుంచే వారికి పారిశ్రామిక రంగం పట్ల ఆసక్తిని, ప్రోత్సాహాన్ని కలిగిస్తే అది వారిలో ఆత్మ విశ్వాసాన్ని పెంచి, పరిశోధనల గురించి ఆలోచింపచేస్తుంది' అంటుంది.

నిజానికి 'గ్రీన్ ఉడ్' కంటే ముందే బిస్మన్ బిజినెస్ ఓనర్ అయింది. దాని గురించి చెపుతూ.."నేను 4వ తరగతిలోనే నా తొలి బిజినెస్‌ను మొదలుపెట్టాను. అది..నా తోటి విద్యార్థులకు సూకెడెలిక్ పెన్సిల్ డెకరేషన్లను అమ్మటం. అదే నా తొలి అడుగు' అంటుందామె.

'పరిశోధనకు, కొత్త ఆవిష్కరణలకు చేసే ప్రయత్నంలో ఎన్నో అడ్డంకులను ఎదుర్కోవలసిరావచ్చు. కానీ కొత్త ఆవిష్కరణ గురించి జిజ్ఞాస మిమ్మల్ని కొనసాగేట్లు చేస్తుంది. నాకు అమ్మానాన్నలు, తమ్ముడు ఎంతో ప్రోత్సాహం అందించా'రంటుంది బిస్మన్.

ఇప్పుడు ఇనొవేషన్ అండ్ ఎంట్రాప్రెన్యూర్‌షిప్ ఫోరమ్స్‌లో బిస్మన్ సుపరిచితురాలు. భవిష్యత్తులో గ్రీన్ ఉడ్‌ను కమర్షియల్ చేస్తానని, విజయవంతమైన సోషల్ ఎంట్రాప్రెన్యూర్‌గా నిలదొక్కుకుంటానని ధీమాగా చెపుతోంది బిస్మన్.




# తేలియాడే హోటల్‌రూమ్‌లో అలలపై అలా అలా ..



జపనీస్ కంపెనీ హుయిస్ టెన్ బాష్..ది ఫ్లోటింగ్ మిజుకమి హోటల్ పేరిట నీటిలో తేలియాడే ఓ హోటల్‌రూమ్‌ను ఓ బాల్ ఆకారంలో డిజైన్ చేసింది. వై-ఫై పాడ్స్ ఉంటాయి. దీని మ్యాపింగ్ సిస్టమ్‌లో ఐలండ్‌కు చేర్చే ప్రోగ్రామ్‌ను ఇమిడ్చారు. ఈ హోటల్‌రూమ్ నలుగురికి సరిపోయేలా ఉంటుంది. ఇందులో బెడ్స్, టాయ్‌లెట్స్, షవర్స్ వంటి సౌకర్యాలన్నీ ఉంటుంది. సముద్రంలో ఓ రాత్రంతా ఈ ఫ్లోటింగ్ హోటల్‌రూమ్‌లో గడపవచ్చు. ఈ హోటల్‌రూమ్ ఎంత ఉంటుందీ అంటే..36-38 చ.మీ. రాత్రంతా ప్రయాణించి ఉదయానే ఓ దీవి చేరుతారు. అయితే ఆ దీవిని ఇప్పుడిప్పుడే లగ్జరీ రిసార్ట్‌గా తీర్చిదిద్దుతున్నారు. ఒక ట్రిప్‌కు 250 పౌండ్లు చార్జి చేస్తారట. ఎంచక్కా సముద్రపు నీటిపై తేలియాడే హోటల్‌లో కూర్చుని, ఆకాశంలోని నక్షత్రాలను చూస్తూ రాత్రివేళ ప్రకృతి అందాలను చూస్తూ పరవశించవచ్చు. అయితే ఇలా ఈ ఫ్లోటింగ్ హోటల్ ట్రిప్ అందుబాటులోకి వచ్చేది వచ్చే చలికాలంలోనట.

## తాబేలు పొట్టలో నాణేలు!

థాయ్‌లాండ్‌లోని ఓపార్క్‌లో ఏర్పాటు చేసిన చెరువులో ఓ తాబేలు..దానిఅసలు పేరు ఆమ్‌సిన్. ముద్దు పేరు బ్యాంక్. ముద్దు పేరు భలే ఉంది. దాని వయసు 25 సంవత్సరాలు. అయితే ఇంతకాలమూ అక్కడికి వచ్చే టూరిస్టులు సరదాగా తనపై విసిరే నాణేలను బ్యాంక్‌గారు అమాయకంగా మింగేసారు. ఫౌంటెన్‌లోకి అలా నాణేన్ని విసిరితే అది అదృష్టాన్ని కలిగిస్తుందని వారు విశ్వసిస్తారు. వారి అదృష్టమేమోకాని నీటిలో ఉన్న బ్యాంక్ గారు మాత్రం ఇప్పటి వరకు 915 నాణేలు మింగడంతో ఆరోగ్యం దెబ్బ తింది. దాని పొట్టలో ఆ నాణేలన్నీ ఓ 5కిలోల బరువైన బాల్ లాగా ఏర్పడ్డాయి. ఆమ్‌సిన్‌కు ఆపరేషన్ చేయక తప్ప లేదు. ఏడుగంటల పాటు సర్జన్లు శస్త్రచికిత్స చేసి ఒక్కోసారి కొన్ని నాణేల వంతున బయటకు తీశారు. త్రీడి స్కాన్ తీయగా దాని కడుపులో రెండు చేపల హుక్‌లు ఉన్నట్లు తెలిసింది. వాటిని కూడా బయటకు తీశారు. ఈ సర్జరీకి అవసరమైన నిధిని పోగుచేయడానికి ఉద్యోగులు విరాళాలు సేకరిం చగా 347 పౌండ్లు వచ్చాయి. చులలాంగ్ కార్న్ యూనివర్సిటీలోని వెటర్నరీ మెడికల్ అక్వాటిక్ ఏనిమల్ రీసెర్చి సెంటర్‌లో ఆపరేషన్ జరిగగింది. ఆమ్‌సిన్‌ను లిక్విడ్ డైట్‌మీదే ఉంచారు. గ్రీన్ సీ టర్టిల్ ఎనభై ఏళ్ల వరకు జీవించగలదు. 'ఇంటర్నేషనల్ యూనియన్ ఫర్ కన్జర్వేషన్ ఆఫ్ నేచర్' వారు సముద్రపుతాబేలును 'ఏండేంజర్డ్ స్పీసీస్'లో చేర్చారు. నాణేలను నీళ్లలోకి విసరటం కూడదని, అది జంతుహింస అని ఈ తాబేలు ఉదంతం మరోసారి రుజువుచేసింది.



## చాకుతో చక్కగా ఐ లైనర్!!



కన్ను ఎంతో సున్నితమైన భాగం. కానీ అనామిక కొఠారి అనే పద్నాలుగేళ్ల బాలిక ఏకంగా చాకుతోనే ఐలైనర్ వేసుకుంటోంది. అరుదైన ఈ ఫీట్‌తో అనామిక ఇండియాస్ గాట్ టాలెంట్‌లో కూడా చేరింది. అనామిక రాజస్థాన్‌లోని అజ్మీర్‌కు చెందింది. సాధారణంగా నాకు బిడియం ఎక్కువ. చాలా తక్కువ మాట్లాడుతాను. అందుకే ఫేమస్ కావాలి అనే ఎప్పుడూ కోరుకోలేదు. కానీ ట్రిక్స్ ప్రదర్శించడమంటే నాకెంతో ఇష్టం. సవాలుగా ఉండే ఎన్నో యోగా భంగిమలను ప్రదర్శిస్తాను' అంటుందామె. అనామిక గత రెండేళ్ల నుంచే యోగా నేర్చుకుంటోంది. గురువు ఎవరో కాదు. 35 ఏళ్ల తండ్రి నరేంద్ర కుమార్ కొఠారీయే. 'నాకు చదువు చెప్పించడానికి లేదా ఏదైనా టాలెంట్‌ను వృద్ధి చేసేందుకుకాని మా తల్లిదండ్రులకు డబ్బులుండేవికావు. కానీ నా పిల్లలకు ఆ సమస్య ఉండకూడదు' అంటాడు నరేంద్ర కొఠారి. ఎన్నో స్టంట్‌లను నేర్చుకున్న అనామిక చాలా ప్రత్యేకమైన అంశం ఏదైనా చేయాలనుకుంది. ఫలితమే చాకుతో ఐలైనర్ వేసుకోవడం. రోజూ 2 గంటలకాలం యోగాకు కేటాయించే అనామిక ఇప్పటివరకు జాతీయ స్థాయిలో ఎన్నో మెడల్స్, సర్టిఫికెట్లు పొందింది. ఐతే ప్రపంచ రికార్డు సాధించాలన్నది ఆమె ఆశయం. త్వరలోనే ఫలించాలని కోరుకుందాం. ■





# 'సరికొత్త ఉరి!'

- ఎస్.నాగభూషణం రెడ్డి

**కోర్టుపని పూర్తయ్యాక కారును సమీపించి డ్రైవర్ డోరు తెరవగా లోనికి ప్రవేశిస్తుండగా "సార్!" అన్న పిలుపు వినపడటంతో వెనక్కి తిరిగి చూసాను.**

**ఎదురుగా రాజారాం. సంవత్సరం నుండి నాకు బాగా పరిచయం ఉన్న ముఖమే!**

**ప్రతి వాయిదాలోనూ అతని దుఃఖపూరితమైన గొంతు ఎప్పుడూ వినిపిస్తూనే ఉంటుంది. అతనిది అతనికే పరిమితమైన అంతానికి నోచుకోని ఆవేదన. తడి ఆరని కళ్ల రోదన.**

"క్షమించండి సార్! రేపు తీర్పుని కోర్టులో మీరే చెప్పారు. అభం శుభం తెలీని నా కూతుర్ని, తను ఇక లేదని, రాదనే నిజాన్ని తట్టుకోలేక శాశ్వతంగా నాకు దూరమైన నా భార్యని, దిక్కులేని నా ఒంటరితనాన్ని మరువకండి. మీరు ఇచ్చే తీర్పు ఈ ప్రపంచానికి ఓ పాఠం చెప్పాలి. విద్యార్థులకు కొత్త పాఠ్యాంశం కావాలి. నేర సమాజానికి మేలుకొలుపు, హెచ్చరిక అవ్వాలి. రగులుతున్న అగ్నిపర్వతం లాంటి ఈ గుండె ఆరని మంటలతో ఒక మనిషిగా నామమాత్రానికే నడుస్తూ, పేరుకే జీవించి ఉన్న ఎముకల గూడుగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాను... కనికరించండి అయ్యగారూ!" అంటూ తన భుజం మీదున్న పాత టవల్తో నుదురు, కళ్లు తుడుచుకుంటూ నమస్కరించాడు రాజారాం.



బాధతో కూడిన అతని సంస్కార దుఃఖం ధర్మబద్ధంగానే ప్రశ్నిస్తోంది నన్ను.

ఆ సమయంలో... అదీ కోర్టు ప్రాంగణంలో నేనేమీ అతనికి సమాధానం చెప్పలేను. అందుకే మనసు ప్రశాంతంగా ఉంచుకోమన్నట్లుగా గుండెలమీద చేయి వేసి నిశ్శబ్దంగానే దిగులు చెందకు– అంటూ మాటల్లేని ఓదార్పును ప్రకటించాను అతనికి.

మరోసారి నమస్కరిస్తూ వెనుదిరిగాడు అతను. అతన్ని చూస్తోంటే నాకు పరిస్థితుల పెనుదెబ్బలతో దెబ్బతిన్న మనిషి నడవక తప్పనిసరి పరిస్థితుల్లో... ఏదో కోల్పోయిన మనిషి ఆ కోల్పోయినదేదో తిరిగి పొందాలని అన్వేషిస్తున్నట్లు... ఏ తోడు లేక తన నీడనే తోడుగా భావిస్తూ తనతోటి అద్దైనా వస్తున్నదో లేదోనని పరిశీలిస్తూ తడబడుతున్న బడుగుజీవి కన్పించాడు.

ఏదేదో ఆలోచిస్తూ ఇంటికి చేరుకున్నాను.

మన ఆలోచనలను కాలం నియంత్రించలేదని రాత్రయ్యింది. నిద్ర రావటం లేదు. ఆ నిద్రే తప్పని తన సవాల్ తను విసురుగా విసురుతూ మెలుకువనే ఆ రాత్రి శిక్షగా విధిస్తోంది.

కొన్ని పరిస్థితులలో నిద్రకన్నా మెలుకువే ఒక్కోసారి మనోనిబ్బరాన్ని కలిగిస్తుందేమో?

ఆకలే ఒక్కోసారి రుచిగా మిగిలినట్లుగా? ఏమో?

సంవత్సరం క్రితం రాజారాం కుమార్తె కేసు నా కోర్టు పరిధిలోనికి వచ్చిన విషయం గుర్తొచ్చింది. వ్యవసాయ పనులే తమ జీవనాధారంగా బతుకు వెళ్లదీస్తున్న రాజారాం, రాములమ్మ రోజూవారి తమ పనులకు తాము వెళ్లారు.

ఆ రోజు ఆదివారం. స్కూల్ సెలవు కావటంతో ఇంట్లో ఒంటరిగా ఉన్నవారి కుమార్తె సంధ్యను ఆ ఊర్లోనే ఉంటున్న విద్యాసాగర్ అతని స్నేహితుడు శివరాం ఆ పాపపై అత్యాచారం జరిపారు. ఊరి చివరి ఇల్లు కావ టంతో ఆ పాప కేకలు, అరుపులు, ఆర్తనాదాలు ఎవరికీ వినిపించలేదు. ఆ పాశవిక ఆట సాయంత్రం వరకు కొనసాగింది.

ఫలితంగా పదేళ్ల ఆ చిన్నారి కన్ను మూసింది.

ఆ తర్వాత పోలీస్ ఇన్వెస్టిగేషన్లో భాగంగా ఆ ఇద్దరు అబ్బాయిలనూ అరెస్ట్ చేశారు.

కూతురు అనుకోని పరిస్థితుల్లో మృతి చెందడంతో రాజారాం భార్య గుండెపోటుతో మరణించింది. ఒంటరిగా వెళ్లిన తన కూతురికి తోడుగానేమో? ఎంతైనా అమ్మ కదా!

ఈ కేసులో తగిన ఆధారాలు లభించడం వల్ల ముద్దాయిలిద్దరూ నేరాన్ని అంగీకరించడంవల్ల తీర్పుకు ఇంత కాలం కూడా అవసరం లేదు.

కానీ అందరూ అనుకుంటున్నట్లుగా చట్టం తన పని తాను చేసుకుపోతుందనుకోవడమూ చాలా సార్లు వీలు కాదు.

తన పరిధిని, న్యాయశాస్త్ర ప్రకారం నడుచుకుంటూ నెలల ప్రకారం వాయిదా వేస్తూ రాకా తప్పదు.

సంధ్య విషయంలో ఈ దమనకాండ జరిగినపుడు నిందితులు ఇద్దరూ మద్యం సేవించి ఉన్నారు. దాహంతో గొంతు ఎండిపోయిన మనిషికి సమయానికి గ్లాసుడు నీళ్ల దొరకవు!

ప్రాణాపాయ స్థితిలో కొట్టుమిట్టాడుతున్న వ్యక్తికి సకాలంలో అంబులెన్స్ సౌకర్యం లభించదు!

అనారోగ్యుడికి అత్యవసర సందర్భంలో అవసరమైన మందులు దొరకవు!

నిండు గర్భిణికి సంకట స్థితిలో ప్రభుత్వాసుపత్రిలో వైద్యులు అందుబాటులో ఉండరు.

కానీ ఎప్పుడూ సంధ్య, అసుర సంధ్య ఏ వేళలోనైనా అందుబాటులో ఉండేవి మత్తుకు మర్మకాపురంగా ఉండే బెల్టుషాపులు వాటికి వీడని బంధుత్వమున్న మద్యం దుకాణాలు.

ఇది మన ఖర్మభూమికి తరాలనుండీ మిగిలిన దౌర్భాగ్యం.. మహానుభావుల హెచ్చరికలూ గుర్తించి గౌరవించని మన దురదృష్టం... నివారించలేని చేతగానితనం.

రామాలయం లేని ఊళ్లుండవు అంటారు. కానీ వెతికితే ఎక్కడోచోట ఉంటాయి. కానీ మద్యంషాపులు లేని ఊర్లు లేనేలేవు.

తెల్లవారుజాము వరకు తెల్లారి ఇవ్వబోయే తీర్పుపాఠాన్ని రాసి చాలాసార్లు తిరిగి మళ్లీ మళ్లీ పరిశీలించుకున్నాను. ఎందుకంటే తీర్పు అనేది కల్తీ లేని పాలులా ఉండాలి.

నీళ్ల, పాలు కలగలుపులా ఉండకూడదు.

ఇన్నేళ్ల నా అనుభవంలో ఏ తీర్పు గురించీ ఇంతగా తర్జన భర్జనలు పడలేదు. ఆ అవసరమూ రాలేదు. ఈ తీర్పు అమాయకత్వంపై జరిగిన అరాచకంపై ఆవేశం నుండి పుట్టింది. అందుకే సమాజానికి అవిశ్రాంత నిర్ణయం ఇవ్వాల్సిన అవసరముంది.

చట్టశాసన శృంఖలాలను తెగతెంపేలా.. దేశ విదేశాల్లో ఇది చర్చకు వచ్చేలా.. ప్రపంచం మొత్తాన్నీ నిలువునా వేధించ బడుతున్న ఈ ఘోర అసాంఘిక అత్యాచారాలకు ఓ దారి తెన్నూ చూపించాలి. మరోమనిషి ఈ దుశ్చర్యకు దిగజారేందుకు భీతిల్లాలి.. ఒళ్ల కంపించాలి. నీతిమాలిన తప్పుకు శిక్ష ఎలా ఉంటుందో తెలియాలి.

ఓ మహాత్మా.... ఓ మహర్షీ... ఓ దయానిధీ... ప్రభూ.... ఆ ధైర్యం, తెగువ నాకు ప్రసాదించు.

అఘాయిత్యానికి పాల్పడి మనిషి రూపంలో ఉన్న మృగాళ్లకు చివరి రోజు కూడా... ప్రతి గంట, నిమిషాలు... క్షణాలూ చావురాక ఇబ్బంది పెడుతూ కసితీరా క్షమించకూడదు.

ఇది నిజమవ్వాలి.. అయితీరాలి!

ప్రతి హృదయాన్ని నా తీర్పు తడుముతుందనే నా నమ్మకం... ఆశ.... అంతకు మించి ఆక్రోశంతో కూడిన బాధ. నా తీర్పు నిప్పులా కాకున్నా.... నివురుకప్పిన నిప్పులా ఉండి మౌనంగా అయినా ఎదగాలి.... ఎదిరించాలి.

నేరాలకు సమర శంఖారావం లేని రణం ప్రకటించాలి. వెధవలకు తను చేసిన తప్పుకు తన అంతరాత్మే ప్రతిరోజూ చెంపపెట్టుతో గుర్తుకు తేవాలి. ఈ పనికిమాలిన పని ఎందుకు చేశానా? అని కుమిలిపోవాలి, మానసికంగా కుమిలిపోవాలి.

ఏ జవాబు రాని.... లేని ప్రశ్నలా, అసలే జవాబూ సరిపోకుండా అంతర్మథనం కలిగించాలి.

ఎదుటివారిని తస్మాత్ జాగ్రత్త! అంటూ దండోరా వేయాలి.

నేరస్తుడు తన తప్పిదాన్ని కలలో కూడా చూడగలగాలి.

కొన్ని నేరాలకు ఉరిశిక్ష ఒకటే మార్గం కాదు. దానికి మించిన తీర్పూ ఉండకపోదు... ఉంటుంది కూడా!

* * *

మరుసటి రోజు కోర్టుకు చేరుకున్నాను!

తీర్పుకోసం న్యాయవాదులు, కోర్టుహాల్లోని జనం, మీడియా అంతా ఎదురుచూస్తున్నారు.

ప్రస్తుతం అంతా నిశ్శబ్దానికి తల వంచిన శబ్దంలా ఉంది.

అందరికీ అభివాదం చేసి కూర్చున్నాను.

రాజారాంతో సహా ఆ ఇద్దరు ముద్దాయిలూ నా వైపే చూస్తున్నారు.

తీర్పివ్వడం ప్రారంభించాను.

"కేసు పూర్వాపరాలు పరిశీలించిన మీదట, వాదోపవాదాలు విన్న తర్వాత ముద్దాయిలు- విద్యాసాగర్, అతని స్నేహితుడు శివరాం ఇరువురూ చిన్నారి సంధ్యపై అమానుష అత్యాచారానికి పాల్పడినట్లు కోర్టు విశ్వసిస్తున్నది.

పోస్ట్‌మార్టం నివేదిక ప్రకారం- ఇద్దరు ముద్దాయిలూ ఆమెపై చాలాసార్లు అసాంఘిక చర్యకు విచక్షణా రహితంగా పాల్పడినట్లు రుజువయ్యింది. అంత పెద్ద తప్పు చేసినా వారిద్దరిలో ఏమాత్రం ప్రాయశ్చిత్త ధోరణి కనిపించకపోవడం వారి పాషాణ హృదయాలకు నిదర్శనం.

ఈ కేసుకు సంబంధించి తగిన శిక్షగా బహుశా న్యాయ చరిత్రలో ఏనాడూ ఎవరూ ఇవ్వని తీర్పు ప్రకటించక తప్పడం లేదు. సహజంగా ప్రతి ముద్దాయి లేదా నేరస్తుడో తనకు సానుభూతి క్షమాభిక్ష కావాలనే కోరుకుంటాడు. కానీ అది కాదు ముఖ్యం. మనముందు నిలబడివున్న సమస్యకు పరిష్కారం కనుగొనాలి.

మూలాలను అన్వేషించి తగిన చర్య తీసుకోవాలి.






అధర్మబద్ధంగా ఒక పని చేయడం చట్టారీత్యా నేరం. ఆ సమయంలో ఆ చిన్నారి వేదనకు ఏ హారిణీ తుషార మేఘం తన కనురెప్పలను కర్తవ్యంగా తుడిచే అవకాశం కోల్పోయిందో ప్రపంచమే ఇరుకైనపుడు... కనికరమే కనపడనపుడు... రానపుడు... తోడే లేనపుడు...

ఆ పెనుగులాటలో పెనుదుఃఖం ఎదను గెలుకుతూ ఆ చిట్టిగుండె తల్లడిల్లినపుడు, ఆ చివరి కంటినీటి చుక్కకు జవాబు దారేది? తీర్పు నిర్ణయానికి ముందే న్యాయ నిపుణుల ప్రత్యేక కమిటీని, మానవ హక్కుల సంబంధ విభాగాన్ని సంప్రదించడమూ జరిగింది.

న్యాయానికి కళ్లు లేవు, చెవులు తప్ప అంటుంటారు అంతా... అది తప్పు!?

న్యాయానికి చెవులతోపాటు సమస్యను మానవీయ కోణంలో చూస్తూ ఆలోచించగలిగే గొప్ప మనసనే కళ్లున్నాయి. దానికి ఎల్లలు, అరమరికలూ లేవు. దేశాభివృద్ధిని, మానవ జీవితాల్ని కకావికలం చేసే ఉగ్రవాదుల్ని, తీవ్రవాదుల్నీ ఉరిశిక్షతో సరిపెట్టేస్తాం. అయినా వాటిని నిర్మూలించగలిగామా? అరాచక శక్తుల్ని ఆపగలుగుతున్నామా? స్వతంత్ర భారతంలో ఇంతవరకూ ఏ ఉరిశిక్షా ఏ నేరాలనూ ఆపగలగలేదు. వాటి దుందుడుకు ఆగలేదు.

మనుషుల్లో మార్పు రానంతవరకు కేవలం చట్టాలు, శిక్షలే వాటిని నియంత్రించలేవు. నిర్భయ చట్టం ఏ భయాన్ని అణచగలిగింది? ప్రతిచోటా నిర్భయలు కనిపిస్తూనే ఉన్నారు!

మరి ఇలాంటి మానసిక ఉగ్రవాదుల్ని, కామ తీవ్రవాద పిశాచాలను ఏ శిక్షతో సరిపెడదాం?

ఉరా...? కాదు..!? కొన్ని నిమిషాల బాధతో ముగించడంలో సమస్యకు సమతుల్య తూకం ఇవ్వలేం. ఎలాంటి మానసిక వ్యధ లేకుండా వేసేది శిక్ష కాదు... కానేరదు.

ఒకపరి మరణం... కొందరి ఆకలివేదంగా బతుకుబండిని ముందుకు కదిలేలా చేస్తుంది.

మనిషి మెలుకువరాని మహానిద్ర ఓ కాటికాపరికి... ఆఖరి ఆరడగుల గుంత తవ్వేవాళ్లకు, శ్మశానం ప్రహరీగోడ మొదట్లో కట్టెలమ్మేవాడికి, చివరకు పాడి మోసేవారే లేనపుడు అదీ మరో నలుగురికీ కూలీ ఇప్పిస్తుంది...! తన మరణం కూడా ఇతరుల కడుపు నింపేలా మనిషి ఆఖరిగా సాధించే విజయం ఇదే!

చివరగా... ఈ ఇద్దరు ముద్దాయిలనూ నేరస్థులుగా పరిగణిస్తూ తగిన శిక్షగా వీరి మర్మాంగాలను తొలగించి వాటి స్థానంలో చిన్న ప్లాస్టిక్ పైపుని అనుసంధానం చేయాలి.

అవును... ఇదే నిజమైన శిక్ష ... సరికొత్త ఉరి!

ప్రపంచంలో ఎవరూ ఎపుడూ ఇలాంటి నేరాలకి విధించని కొత్త శిక్ష!

ప్రతి గంటకో, రెండు గంటలకో వారు విసర్జనకు వెళ్లిన ప్రతిసారీ తమ తప్పును గుర్తుకు తెచ్చే మరపురాని... మరువలేని శిక్ష.

ఆపరేషన్ రెండు వారాల్లో పూర్తి చేయాలని వైద్యులను ఆదేశిస్తున్నాం. ఇది ఇరువురి న్యాయవాదుల సమక్షంలో నిర్వహించాలి. వీడియో చిత్రీకరణ జరిపి, కాపీని సీల్డ్ కవరులో కోర్టుకు సమర్పించాలి. ప్రపంచానికి ఈ విషయం తెలిసేలా ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియా అంతా దీన్ని ప్రచురితం, ప్రసారం చేయాలి. తీర్పు ఇంతటితో ముగిస్తున్నాం"

* * *

తీర్పు వెలువడించిన కొద్ది నిమిషాల్లోనే కొన్ని వందల ఫోన్లు వచ్చాయి.... ఇంకా ఎన్నో వస్తున్నాయి.

అందరూ తీర్పునకు అనుకూలంగా అభినందనలు తెలుపుతున్నవారే.

నా తీర్పు సరైనదేనన్న అభిప్రాయం నాలో కొంత గర్వాన్నే నింపుతోంది.

ప్రజలు ఇస్తున్న అభినందనలు వారు సామూహికంగా ప్రకటిస్తున్న ఎక్కడో బ్రిటన్‌లో ఉన్న కోహినూర్ వజ్రం అంతటి మెడల్‌గానేమో?

ఏదైనా ఫలితం సాధించినపుడే కష్టం కాస్త సేదతీరేది!

నేరుగా కారువద్దకు వెళ్లేసరికి ఎదురుగా రాజారాం! ఇప్పుడు అతని ముఖంలో విషాదం లేదు... ఏదో చెప్పలేని ఆనందం!

నేరుగా నన్ను సమీపించి వంగి నా పాదాలకు నమస్కరిస్తూ వాటిమీద రెండు గులాబీపూలు, రెండు ఫొటోలూ ఉంచాడు. అవి అతని భార్య రాము లమ్మ, కూతురు సంధ్యలవి. అతని కన్నీళ్లు నా పాదాలను కడుగుతున్నాయి.

తనకు జరిగిన న్యాయానికి రాజారాం లాంటి మామూలు మనిషి ఇచ్చే బాధ్యతాయుతమైన గౌరవ వందనం అదే!

■

# అప్పారావు గది

**ఈసారి** తక్కువ పోయిందని చీటి పాడేసినాను. నా చీటి స్టేట్‌మెంట్ మీ ఆర్వోకో, జద్వోకో పంపించు అదేందో సూరీటి పారము మర్నాడు కొరియర్‌లో రాంగనే ఇంటికొచ్చెయ్ వాసు.. సంతకాలు చేస్తాను. ఈసారి డబ్బవసరముందని చెప్పాడు అప్పారావు. తను చెప్పింది విన్న వాసు భూమికొంచిన తల తిప్పుతూ సరేనన్నాడు.

మూడవ రోజు అప్పారావునుండి వాసుకు ఫోన్. దే..వుడా నిన్నటి నుంచి పది సార్లు ఫోన్ చేసి నా సూరీటి పారమొచ్చిందా.. నా సూరీటి పారమొచ్చిందా అని సతాయిస్తున్నాడు. సార్! సూరీటి ఫామ్ ఈరోజే వచ్చింది. సాయంత్రం డాక్‌మెంట్ తీసుకొని మీ ఇంటికొస్తున్నాను.. అని కోపంగా చెప్పాడు, వాసు.

...

బాగున్నారా సార్! జనరల్ స్టోర్‌లో బిజీగా ఉన్నా నవ్వుతూ పలకరించాడు అప్పారావు కొడుకు రాజబాబు. ఒక్క నిమిషం సార్! అని జనరల్ స్టోర్‌కు వచ్చినవారి సరుకుల లిస్టు చూస్తున్నాడు. ఇంతలో రాజబాబు ఫోన్ మోగింది. మా నాన్నే సార్. రాజ...రే.. రాజ చిట్‌ఫండ్ వాసొస్తే పైకి రమ్మని చెప్పు అని స్పీకరుద్వారా వాసుకి వినబడింది. సార్! మీరే పైకి వెళ్లాలంట అని నవ్వుతు చెప్పాడు రాజబాబు. చూడండి సార్! నేనూ పైకి వెళ్తున్నా, అప్పుడే నాక్కూడ ఫోన్. దేవుడా ఉండాల్సిన మనిషే సారంటు, అప్పారావు గదికి వెళ్లడానికి డోర్ తెరిచాడు.

అప్పారావు చీటి పాడుకోవడం కొత్త కాదు. నేను అప్పారావు గదికి రావడం కొత్తకాదుగాని అప్పారావు గది మాత్రం మార్చలేకపోతున్నాడు. గది ఇలాగే ఉండాలని సెంటిమెంటే పెట్టుకున్నాడో ఏమో అని తనలో తాననుకుంటు సగం పట్టే మనిషి గ్యాప్‌లో తల పైకెత్తుకొనే వస్తున్నాడు.

ఇంతలో అప్పారావు మంచం నుండి మెట్లమీదకు ఓ గంట కట్టిన తాడు వాసుకి తగిలింది. గంట అలికిడి అయింది.. వాసూ అంటు మంచమ్మీద నుండే పలకరించాడు అప్పారావు. ఏం సారు ఇది మీ పట్టుదలనుకోవాలా? వచ్చే మనిషి ఇబ్బంది పడాలనుకోవాలా? అని అప్పారావు ముఖమీదనే గట్టిగా అడిగాడు వాసు. ఉండాల.. ఉండాల.. కళ్లద్దాలు తగిలించుకుంటూ సమాధానం చెప్పాడు. కూర్చో అని అప్పారావు ఎలుకలు కన్నాలేసిన పాత బ్యాగులో రాసేసిన డైరీ రాతలో తనకొచ్చే చీటి డబ్బులెంతన్నది వివరంగా చెప్పి అందులోని తన ఫొటో, ఆధార్ కార్డు బయటకు తీశాడు. వాసు అప్పటికే అసౌకర్యంగా నిలబడున్నాడు. కుర్చీలో కూర్చుందామనుకుంటే దానిపై న్యూస్‌పేపర్ల గుట్ట. అందునుండి అప్పారావు కనుగుణంగా అప్పారావు ఏటవాలుగా అట్టముక్కను వేసుకొని రాయడానికి సంతకాలు చేయడానికి వీలుగా ఉన్నది. వాసు కూర్చుందామనుకుంటే పరుపుమీద కాలిపోయిన మస్కిటో కాయిన్స్ రాలిన పొడి, ఫ్యానేస్తే పరుపుమీద పొడి ముక్కుకెక్కుతుందన్న భయం. ఏది ఏమైనా వాసు నిలబడే అప్పారావు సంతకాలు చేయవలసిన గుర్తులు చూపుతూ సంతకాల కార్యక్రమం ముగించాడు.

విడుదలైన ఖైదిలాగ వాసు అప్పారావు గదినుండి బయట పడ్డాడు.

– ఎం. రామచంద్ర

# 'అక్షర ఉగాది'

**అక్షరం** సమస్యల శఖలమై
అధికార నిషేధాల వలయమై
పరిష్కారం కాలహరణమైతే
ఎద 'కారం'లా మండుతుంది
మానని వ్రణమై
రణమే అవుతుంది.

అక్షరం జగతికి
మేలుకొలుపై
మనిషి ప్రగతికి
మేటి మలుపైతే



పదపదమూ పచ్చి 'పులుపై' నా
నరుని దేహం శుభ్రమే అవుతుంది.

అక్షరం అమితానంద రవమై
అవినీతిపై గురి తప్పని శరమై
వాక్యం సంక్లిష్ట లవణమైనా..
జిహ్వకి 'ఉప్పు' రుచే అవుతుంది.

అక్షరం అవనికి ఉద్దీపనా
శూన్యమై
కవివర్యులకు అహంకారమైతే..
శ్రవణం శ్రోతకి కటిక 'చేదే'
అవుతుంది.
అక్షరం భ్రమణం అపసవ్యమై

సంఘం గమనం అసభ్యమైతే..
రచన పతితకు 'ఒగరే' అవుతుంది.

సమాజం సంస్కరణే చరణమై
కవిత్వం ధర్మ సమరమైతేనే..
అక్షరం అజరామరమవుతుంది
పాఠక నోరు మహా 'తీప'వుతుంది.

అక్షరం చైతన్య సమ్మేళనమైతేనే కదా!
కవనం కమ్మని ఉగాదయ్యేది...
మామిడి తోటలో మత్తకోకిల పాటలా.

– అశోక్ అవారి

---

# హైకూలు

**మే**ఘమాలకు
నెలలు నిండే వేళ
శ్రావణ శోభ
* * *
వెలుగు రేడు
నీడలను ఆడించే
గారడీవాడు
* * *
సీతాకోకలు
చీరలకొట్టులోకి
'రంగు' ప్రవేశం
* * *
పాల సముద్రం

వెన్నెల రూపాంతరం
ప్రేమ అమృతం
* * *
శివాలయంలో
మూడు కన్నుల పంట
ఊర్వశి నాట్యం
* * *
భావాల పురి
విప్పి ఆడే మయూరి
ఆధునికత
* * *
తడిబట్టలు
ఆరేసిన దండెంతో
కన్నీటి పాట
* * *
టివి కోడలు
ఆకాశవాణి అత్త
ఆగని నస
* * *
రోజూ సాయంత్రం
ట్యాంక్‌బండ్‌పై వర్షం
జెండావందనం

– రఘుశ్రీ

---

# "నాయినా! బాగున్నావా?"

**పుడమి**
పసిపాపలా నవ్వుతుంది
పువ్వు పలకరింపుగా పరిమళిస్తుంది
లేలేత కిరణాలు
స్వాగత దీపాలంకరణ తోరణాలు కాగా
తూరుపు ముఖారవిందం
చూడముచ్చటయింది
అల్లంత దూరంలో మా వూరు
సంక్రాంతి రంగవల్లిలా వుంది
మదిలో పన్నీరుజల్లు
లేగదూడల పరుగులు
అమ్మ కొంగు పట్టి నేను
పరుగులు తీసినట్లే అనిపిస్తుంది
గుండెనిండా తడి

ఆ పొలాలు, పైరులు, పచ్చదనాలు
కాకపోతే గ్లోబలైజేషన్ వాసన
స్పష్టంగా వుంది..
అమ్మ మదిలో మెదిలింది... యదని తడిమింది

"నాయినా! బాగున్నావా?"
ఖచ్చితంగా అమ్మ ఆత్మీయ ఆలింగనమే అది
ఊరిలో అడుగిడగానే
నాన్న జ్ఞాపకం
నాన్న గుర్రపు బండి... నేను మహారాజుని
తోబుట్టువులు... ప్రాణస్నేహితులు... నేడది వింత కథ
ఇంటి ముఖం చూడలేకపోయాను
దీనంగా ... గుండెను పిండేసే దృశ్యాలు
అమ్మ నాన్న కన్నీటి చారలు
మొండిగోడల నిండా ... స్పష్టమౌతున్నాయి
ఊరికి పోయానని సంతోషపడనా!
గూడు చెదిరి గువ్వలెగిరిపోయిన ఇంటిని చూసి దుఃఖించనా?

– మీగడ వీరభద్రస్వామి

---

## రచనలకు ఆహ్వానం

రచయితలనుండి కథలు, కవితలు, సమకాలీన వ్యాసాలు స్వాగతిస్తున్నాం. రచనలతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని రచనలు తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న రచనలు పంపించకండి. **రచనలు పంపించాల్సిన చిరునామా:**

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80**

సింగిల్ పేజీ కథ

# పుల్లయ్య ప్రావీణ్యం

– కృష్ణ మాధవరపు

మా ఊళ్లో సన్న, చిన్న పెద్ద రైతాంగంలో పుల్లయ్య నామధేయులు చాలా మంది ఉన్నారు. వారిలో బడా రైతు 'నోటిలెక్కలు' పుల్లయ్య ఒకరు. నోటిలెక్కలు ఆయన ఇంటి పేరు కాదు. ఆ లెక్కల ప్రావీణ్యం ఆయనకా పేరు తెచ్చిపెట్టింది.

నోటిలెక్కల పుల్లయ్య తన భూముల్లో ఆహార వాణిజ్య పంటలు పండిస్తారు. దినం అనేకమంది వ్యవసాయ కూలీలు పుల్లయ్య పొలాల్లో పొలం పనులు చేస్తారు.

ప్రతీరోజు కమతం గుమాస్తా ప్రసాదు పొలాలు తిరిగి ఎందరు పని చేసిందీ... పద్దు రాసుకుంటాడు. వారపు సంతనాడు కూలోళ్లకి కూలిపనులు యిచ్చేముందు పుల్లయ్య నోటిలెక్క కట్టుకుని ప్రసాదుని పద్దు పుస్తకం దాఖలా ఆరా తీస్తూ తన నోటిలెక్క వెల్లడిస్తాడు.

వెంటనే ప్రసాదు పద్దు పుస్తకం చూసుకుని నిర్ఘాంతపోతాడు. పుల్లయ్య నోటి లెక్క తన పద్దు సరిగ్గా సరిపోయినందుకు. అనంతరం పుల్లయ్య యిచ్చిన సొమ్ము కూలోళ్లకి సరిపెడతాడు.

పుల్లయ్య జ్ఞాపకశక్తి అదృష్టానికి నోటిలెక్క ప్రతిభకి ప్రసాదొక్కడే కాదు... ఊరంతా తెగమెచ్చుకుంటుంది. అందుకే కొందరు పుల్లయ్యతో లెక్కలు కట్టించుకుంటారు.

కమతం గుమాస్తా ప్రసాదు యువకుడు, చదువరి, ఆత్మాభిమాని!

అదును పదును సమయంలో పొలం పనులు రద్దీగా ఉంటాయి. కూలీలు ఎక్కువగా ఉంటారు. అటువంటి సందర్భాల్లో నోటిలెక్కల పుల్లయ్య డబ్బుతో ప్రసాదు టీ, టిఫిన్లు తెచ్చి కూలోళ్లకిస్తాడు. తర్వాత పద్దు రాసుకుంటాడు. బ్యాలెన్స్ మిగిలితే పద్దుపుస్తకంతో కలిపి పుల్లయ్యకి యిస్తాడు. ఆయన పుస్తకం తెరవడు. యధాప్రకారం నోటిలెక్క కట్టుకున్నాక పైకం లెక్క పెట్టుకుని నవ్వుకుంటాడు. దానర్థం తన లెక్క ప్రసాదు యిచ్చి సరిగ్గా సరిపోయిందని.

పుల్లయ్యది వానకాలం చదువు. కానీ చేతి వేళ్లు మడిచి విడిచి పెడుతూ కట్టిన నోటి లెక్క ఎప్పుడూ తప్పదు. కరెక్ట్‌గా వుంటుంది. పుల్లయ్య జ్ఞాపకశక్తికి దండం పెట్టబుద్ధవుతుంది.

ఎవరైనా ఆసక్తికొద్ది అడిగితే... అర్థ శతాబ్దంనాటి వరి రకాలు ఇతర పంటలు, ఇతర పంటలు, ఎకరా పెట్టుబడులు, కూలిరేట్లు, పాలేళ్ల జీతాలు, పొలాల ఖరీదులు, శిస్తులు– వగైరాలు ఎక్కాలు చదివినట్టు చేతివేళ్ల విన్యాసంతో చెబుతాడు. శ్రోతలు నిశ్శబ్దంగా వింటారు.

ఇలా నోటిలెక్కల పుల్లయ్యగా ప్రాచుర్యం బడసిన అరవై అయిదేళ్ల పుల్లయ్య నిరాడంబరుడు. దయాళువు. మాట కరకు.. మనసు నవనీతం. కోపం వచ్చినంతసేపు ఉండదు.

ఇటువంటి మంచి అన్నదాతవద్ద నా సోదరుని పుత్రుడు ప్రసాదుని గుమాస్తా పనికి కుదిర్చాను. బాగానే చేసుకుంటున్నాడని విన్నాను.

"బాబాయ్! రేపట్నుండి గుమాస్తా పనికి వెళ్లను, కుదిర్చింది నువ్వు గనుక నీకు చెప్పేను. పుల్లయ్యగారికి చెప్పలేదు" ప్రసాదు సాయం కాలం వచ్చి కోపంతో అన్నాడు.

"ఏం జరిగిందిరా" అన్నాను.

"నిన్నటికి నిన్న.. ఈవాల్టికి ఈవేళ అదును పదును రీత్యా ఊడ్పు పనులు విరామం లేకుండా జరిగాయి. యధాప్రకారం పుల్లయ్య యిచ్చిన డబ్బుతో ఫలహారం, టీ కొని, తెచ్చి శ్రామికులకి యిచ్చాను. ఇంకా నా వద్ద కొద్దిగా బ్యాలెన్స్ వుంది. నిన్న, ఈవేళ ఒక కూలోడిగా చెమటోడ్చి పాటుపడ్డాను. అందుకాయన మాటవరసకి నన్ను మెచ్చలేదు సరికదా... అకారణంగా కూలీల ముందు నన్ను విసుక్కుని చివాట్లతో చిన్నబుచ్చారు, కాదు అవమానించారు. వెంటనే అందుకు తగ్గట్టు మాట్లాడాలనుకున్నాను. నా వల్ల నీకు చెడ్డ పేరు రాకూడదని ఆగిపోయాను. ఈ వేళయే కాదు ఆ మధ్య రెండు సార్లు చివాట్లు పెట్టారు. ఓర్చుకున్నాను. ఇక నా వల్ల కాదు. నువ్వు నేను రేపు నోటిలెక్కల పుల్లయ్య ఇంటికి వెళ్లాక నిన్నటి పర్యంతం రాసిన జమాఖర్చు కాగితం బ్యాలెన్స్ యిచ్చాక నేను మానేసిన సంగతి చెప్పు" అన్చెప్పి వెళ్లిపోయాడు. అభిమానధనుడు ప్రసాదు.

మరోసారి ప్రసాదుకి "పద్దవాడు చెడ్డవాడు కాద"ని చెప్పలేకపోయాను. ఈ తరం వినదని సందేహించాను.

ఉదయం ఇరువురం నోటిలెక్కల పుల్లయ్యగారి ఇంటికి వెళ్లాం.

నేను కూర్చున్నాను, వాడు నిలబడి వున్నాడు.

ఉభయ కుశలోపరి తర్వాత ప్రసాదు సంగతి ఎత్తబోతుంటే, ప్రసాదు తను రాసి తెచ్చిన పద్దుకాగితం పుల్లయ్యకి యిచ్చాడు బ్యాలెన్స్‌తో కలిపి.

నేను ఆగిపోయి చూడసాగాను.

నోటిలెక్కల పుల్లయ్య నగదు బల్లపై పెట్టి కాగితాన్ని చూసుకుంటూ వేళ్లు మడిచి విడుస్తూ నోటిలెక్క కట్టుకున్న తర్వాత తల పంకించి నవ్వుతూ డబ్బు బనీను జేబులో పెట్టుకున్నాడు. లెక్కపెట్టలేదు. నవ్వేడుగా సరిపోయిందన్న దానికి సంకేతంగా.

"ప్రసాదబ్బాయా! జమాఖర్చు కూలోళ్ల లెక్క సరిగ్గా సరిపోయింది. కానీ చివాట్లు లెక్క తప్పింది. నేను నిన్ను మొత్తంమీద ముప్పై చివాట్లు వేసాను. పాతికని తక్కువ రాసుకున్నావు. అడపా దడపా కూలీలవద్ద నన్ను అయిదుసార్లు పొగిడావు అని నాకు నమ్మకంగా తెలిసింది. కానీ నువ్వు అవి రాయలేదు. వదిలేసావు. నేను వదిలిపెట్టలేదు. నాకు పొగడ్త నచ్చదు. అది గర్వాన్ని పెంచుతుందని దానికి దూరంగా వుంటాను. అందుకని మొత్తం చివాట్లునుండి పొగడ్తలు తీసివేస్తున్నాను. పాతిక చివాట్లు మిగిలాయి. ఆత్మాభిమానం పరిహారంగా చివాట్లకి లేక మొత్తం పాతిక చివాట్లకి ఖరీదు కట్టి చెప్పు, చెల్లిస్తాను" అనేసరికి రాసిన ప్రసాదు, విన్న నేను పుల్లయ్య గణిత శక్తికి, నోటి గణితానికి నివ్వెరపోతూ పుల్లయ్యని మనసారా అభినందించాం.

ప్రసాదు చివాట్లు రాస్తాడు అనిగాని, చివాట్లు, పొగడ్తలు పుల్లయ్య నోటిలెక్కల్లో ఉంటాయి... అని గానీ ఇరువురం స్వప్నంలో కూడా ఊహించలేదు.

ఇప్పుడు ప్రసాదు చెప్పబోయే ఖరీదుకోసం చెవులు రిక్కించాను. క్షణాలు గడిచిపోతున్నాయి. అప్పుడు ప్రసాదుని చూసాను. ఏదో ఆలోచిస్తున్నాడు గాబోలు... పెదవులు కదలడం లేదు.

"ధనాశతో చివాట్లకి ఖరీదు కట్టి చెబితే పుల్లయ్య చెప్పినంత యిస్తారు. తర్వాత ఈ సంగతి ఊరంతా పొక్కిపోతుంది. నవ్వుకుంటారు. వేళాకోళం పట్టిస్తారు. ఇంకా మేం కూడా డబ్బిచ్చి చివాట్లు పెడతాం... ఒప్పుకో" అంటారు. కాదంటే గొడవ పెడతారు. చులకనవుతారు. తాత, తండ్రులకి అపకీర్తి. నోటిలెక్కల పుల్లయ్య గారు కూడా నాకు గౌరవనీయులు, నా యజమాని! పెద్దల మాట చద్దన్నం మూటలా నా మంచికోసం చివాట్లేసాడు అనుకుంటాను. బాబాయి కూడా 'పద్దవాడు ఎప్పుడు చెడ్డవాడు కాదంటుంటాడు. గాబట్టి కమతం గుమాస్తా పని వదిలిపెట్టను. మంచి ఉపాధి దొరికేవరకు చేసుకుంటాను" అని పరిపరి విధాలుగా తర్కించుకున్న ప్రసాదు చివరికి పద్దు పుస్తకం చేతబట్టి పట్టుకుని వెళ్లిపోయాడు.

వెంటనే నోటిలెక్కల పుల్లయ్యగారు పద్దు కాగితాన్ని చించేసారు.

ఆయన చివాట్లకి రేటు ఎందుకు చెప్పమన్నాడో అర్థమై నవ్వుతూ సెలవు తీసుకున్నాను. ■

# వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ
డా॥ దంతూరి పండరినాథ్
3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3
సెల్స్: 9885446501/ 9885449458



# దిగ్భ్రాన్త ద్వార దోషం అంటే ఏమిటి?

- పి.ఎమ్ - కాకినాడ

**ప్రశ్న:** దిగ్భ్రాన్త ద్వార దోషమంటే తెలుపగలరు..

**జవాబు:** ద్వారం... ముఖ్యంగా ప్రధాన ద్వారం ఎటువంటి దోషం లేకుండా ప్రతిష్ఠింపబడినదై వుండాలి. ద్వార ప్రతిష్ఠ సమయంలో ఎంతో జాగ్రత్త, ఓపిక, ఖచ్చితమయిన పద్ధతి చాలా అవసరం. ద్వారం ప్రతిష్ఠింపబడినప్పుడు 'కింది నుండి పైకి (నిలువుగా) లేకుండా కాస్త ముందుకు గాని వెనుకకు గాని వంగి వుండటం' వలన ఏర్పడే దోషాలు, అవి కలుగజేయు చెడు ఫలితాల గురించి తెలుపబడ్డాయి. అంతేగాకుండా ద్వార ప్రతిష్ఠ జేయునప్పుడు ద్వారం అడ్డంగా... నేరుగా లేకుండా ఏదయినా ఒక వైపుకు వంగి వుండటం వలన కలిగే దోషాన్ని 'దిగ్భ్రాన్త ద్వార దోషం' అంటారు.

'దిగ్భ్రాన్తే దన్యభిః పీడా' అని చెప్పబడింది. అంటే ఇటువంటి దోషం కలిగిన గృహ యజమానిగానీ, అందులో నివసించేవారుగానీ సదా చోరులు (దొంగలు) వలన భయాన్ని పొందవలసి వస్తూ ఉంటుంది. ఒకవేళ ఎవరికయినా ఇలాంటి భయాన్ని పొందటం పునరావృతమవుతుంటే ఒకసారి తమ ప్రధాన ద్వారానికి ఇటువంటి దోషమేదయినా వున్నదేమోనని పరీక్షించుకోవటం ఉత్తమం. ఒకవేళ ఈ దోషముంటే సరిచేసుకోవటం వలన దొంగల వలన కలిగే భయం ఇట్టే దూరమవుతుంది.

## మా సమస్యలకు పరిష్కారం!?

- శ్రీనివాసులు - కుప్పం

**ప్రశ్న: ఉత్తర ముఖ ద్వారం కలిగిన ప్లాటు తీసుకున్నాం. ఈ ప్లాట్ ముఖద్వారమే కానీ వెను కకు ఏ విధమయిన గుమ్మాలు లేవు. అంటే రావడం, వెళ్లడం ఒకే గుమ్మనుండి. బాల్కనీ కూడా లేదు. ఇలా వుండడం వాసు ్తరీత్యా మంచిదేనా? కానీ మాకు మనఃశ్శాంతి, సంతోషం లేదు. ఆరోగ్యం బాగుండటం లేదు. అభివృద్ధి,రాణింపు గానీ ఏమీ లేదు. కారణం, నివార ణోపాయం తెలుపగలరు.**

**జవాబు:** అపార్ట్‌మెంటులోకి వెళ్లడానికి ఒకే గుమ్మం వుండడం దోషం కాదు. మీకు మొత్తం నాలుగు గుమ్మాలున్నాయి. అది బాగానే వున్నది. అయితే బాల్కనీలుండటం వలన ఎన్నో సౌకర్యాలు సమకూరుతాయి. ఆ వీలు మీకు లేదు. ప్రధాన ద్వారానికి ఎదురుగా మెట్లు అడ్డంగా వున్నాయి. అది అసలు దోషమవుతుంది. ప్రధాన ద్వారానికి ఎదురుగా అవరోధాలు కలిగించేవి వుండకూడదు. మీ అపార్ట్‌మెంట్‌కి తూర్పున కారిడార్ వున్నది. అక్కడినుండి వేరే అపార్ట్‌మెంట్‌కి వెళ్లే దారి వున్నది. ప్రస్తుతం ఉత్తరంలో వున్న ద్వారాన్ని తూర్పు ఈశాన్యానికి ('S' అని మార్కు చేయబడింది) మార్చటం వలన మీ సమస్య చాలావరకు తగ్గే అవకాశం ఉన్నది. ఈ దోషాన్ని గమనించి నివారణోపాయాన్ని వుపయోగించి సత్ఫలితాలను పొందండి.

## గృహనిర్మాణం గావించవచ్చా?

- సురేష్‌కుమార్ - కర్నూలు

**ప్రశ్న: మీ వాస్తు సలహా ప్రకారం ఎన్నో కుటుంబాలు, గృహ నిర్మాణం జరుపుకొని ఆర్థిక బలంతో, సుఖసంతోషాలతో వున్నారు. మేమూ గృహ నిర్మాణంకోసం, మీ ఆదేశం కోసం వేచివున్నాం. ఈ స్థలం ఉత్తర దిక్కు నుండి 4 అడుగుల వెడల్పు కలిగిన ప్రవేశ మార్గం వున్నది. ఈ స్థలం 37॥ వెడల్పు 48॥ పొడవు కొలతలతో 194 గజాల విస్తీర్ణం వున్నది. సూచించిన స్థలంలో గృహ నిర్మాణం చేయటానికి స్థలం అనుకూలత/ ప్రతికూలతల గురించి తెలుపగలరు.**

**జవాబు:** ఈ స్థలానికి వున్న 4 అడుగుల ప్రవేశ మార్గం ఇదే స్థలానికి 'ఉత్తర వాయువ్య వీధిపోటు' అవుతున్నది. అదే ప్రవేశ మార్గాన్ని మీ స్థలంలో నుండి పడమర వైపు పొడిగించి లేదా కట్ చేసి మిగతా స్థలంలో పశ్చిమ సింహ ద్వార గృహాన్ని మీరు నిర్మించుకోవచ్చు. ఆ ప్రవేశ మార్గంలోనే గేటు పెట్టి ఇల్లు కట్టటం మాత్రం చేయవద్దు.

## మాకు ఈ ఇల్లు సరైందేనా?

- కృష్ణప్రసాద్ - కారంచేడు

**ప్రశ్న: ఈ ఇంట్లో వుంటున్న నేను చాలా కష్టాలు పడుతున్నాను. ఇంతకుముందు గుడిసెగా వుండేది. ఈ మధ్య ఇల్లు కట్టుకున్నాను, అదీ అప్పులు చేసి. ఇంటి గృహప్రవేశంనాడు నా కాలికి దెబ్బ తగిలింది. మూడు నెలలకి బాగయింది. నా కుమారుడికి ఆరోగ్యం బాగాలేక ఆసుపత్రిలో చేర్చాం. ఈ ఇల్లు మాకు సరైందో... లేదో తెలుపగలరు.**

**జవాబు:** ఉత్తర వాయువ్యం పెరిగిన స్థలాన్ని సవరించకుండా ఆ స్థలంలో పడమర ఎక్కువ స్థలం వదిలి, తూర్పు భాగంలో గృహ నిర్మాణం గావించటంవలన వాస్తు దోషాలను కొనితెచ్చుకున్నట్టయింది.

1. ఉత్తర వాయువ్యాన్ని మూలమట్టానికి సరిచేయండి. ఉత్తర ఈశాన్యాన్ని అంగుళం మాత్రం పెంచండి.

2. పడమర భాగంలో వున్న ఖాళీ స్థలంలో పడమర గోడనానుకొని, ప్రధాన గృహాన్ని తాకకుండా రేకుల షెడ్డు నిర్మించండి. షెడ్డులోపల నేలభాగం కనీసం ఎనిమిది అంగుళాలు ఎత్తుగా వుండాలి.

3. మెట్లకింద టాయిలెట్ నిర్మూలించి ఆ స్థలాన్ని ఖాళీగా వదిలేయండి.

4. కామన్ టాయిలెట్ కావాలంటే పడమరలో కొత్తగా కట్టబోతున్న షెడ్‌లో వేసుకోవచ్చు.

ఇల్లు కడితే ఎంతో కొంత అప్పు అవుతుంది. ఇది సర్వసాధారణం. కానీ మొత్తం అప్పు చేసి గృహ నిర్మాణం చేసుకోవడం వివేకమయిన పనికాదు. ఇలా చేసి వడ్డీలు కట్టలేక ఇల్లు అమ్ముకునే పరిస్థితిని కొని తెచ్చుకున్న వాళ్లెందరో! అది గృహవాస్తు దోషం కాదు. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ----------------------------------------
పుట్టినతేదీ:-------------------- ఊరు: --------------
జన్మనక్షత్రం:----------తల్లిపేరు:--------------------
చిరునామా: ------------------------------------------
------------------ ఫోన్: ---------------------------

ఆర్.వి.ఆర్ - వైజాగ్

ప్రశ్న: నమస్తే సర్. మేం సాఫ్ట్‌వేర్ ఇంజినీర్లం. మా పెళ్లయి రెండేళ్లయింది. నా భార్యకి నాకంటే ఫేస్‌బుక్, వాట్సాప్ అంటే ఇష్టం. ఎదురెదురుగాకంటే మేం మెసేజస్‌లో ఎక్కువ మాట్లాడుకుంటాం. మా కోపాలు, తాపాలు, ప్రేమలు, అలకలు అన్నిటికీ ఫేస్‌బుక్కే దిక్కు. నా భార్యకైతే నాతో రొమాన్స్ కూడా ఫేస్‌బుక్కే ఆధారం. తనకోసం నేను కూడా ఫేస్‌బుక్ బాగానే అలవాటు చేసుకున్నాను. గత ఆరు నెలలుగా మా మధ్య శృంగార జీవితం అంత ఆనందంగా లేదు. దానికీ, దీనికీ, ఫేస్‌బుక్‌కి ఏమైనా లింకుందా?

జవాబు: ఎందుకుండదూ... కమ్యూనికేషన్‌కోసం మొదలైన ఫేస్‌బుక్ అలవాటై అది వ్యసనంగా మారి మీ సంసార జీవితం దెబ్బతినే స్థాయికొచ్చింది. ఇంతకన్నా పెద్ద లింకు ఇంకేముంటుంది బాబు! మీ దూకుడు చూస్తుంటే సంసారం.. సీమంతం.. డెలివరీ.. నామకరణం- అన్నీ ఫేస్‌బుక్కులోనే చేసుకునేలా ఉన్నారు. అయినా

# అన్నీ ఫేస్‌బుక్‌లోనే!

ఫేసులు చూసుకోకుండా బుక్‌లోనే ఒకరినొకరు ఫేస్ చేసుకుంటే అన్నీ బుక్‌లోనే జరిగిపోతాయి. ప్రాక్టికల్‌గా ఏమీ మిగలదు. అర్జెంటుగా ఫేస్‌బుక్‌లో కాకుండా నిజమైన ఫేస్‌లతో కౌన్సెలర్‌ని కలవండి. నెట్ వర్క్ మేనియాలో నుంచి బయట పడి జీవితంలోని మాధుర్యాన్ని రుచి చూడండి.




## పర్సనల్ పాయింట్

చల్లా సుబ్రహ్మణ్యం

1 సి-ఐక్యూ టవర్స్, 3-4-540,
నారాయణగూడ, హైదరాబాద్-27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com


## విడాకులు తీసుకున్నతనితో మళ్లీ పెళ్లి!?

సి.యస్ - రంగారెడ్డి జిల్లా

ప్రశ్న: నా వయసు 36. నాకు ఒక పాప. మాది 7 ఏళ్ల సంసారం. నేను ఇంటర్ వరకు చదువుకున్నాను. మా వారు 7వ తరగతి వరకు చదువుకున్నారు. నిజానికి మాది అన్యోన్య దాంపత్యమే. కానీ పెళ్లయిన రెండు ఏళ్లల్లోనే నాకు, మా వారికి గొడవలు తారాస్థాయికి చేరాయి. దానికి కారణాలు మా అమ్మ-నాన్నలు కూడా. వాళ్ల ప్రభావం నాపై చాలా పడింది. మా ఇద్దరి అభిప్రాయం భేదాలవల్ల జరిగే గొడవలకంటే మూడో వ్యక్తుల ప్రమేయం వల్ల జరిగినవే చాలా ఎక్కువ. మేం మా సుఖ సంతోషాలతో గడపిన సమయంకంటే వాదోపవాదాల మీదే ఎక్కువ గడిపాం. మా అమ్మా, నాన్నలకి మా వారికి ఒక్క క్షణం పడేది కాదు. వాళ్ల మధ్యలో నేను నలిగిపోయేదాన్ని. ఒకరోజు జరిగిన తీవ్ర పరిణామాల వల్ల నేను మా పుట్టింటికి రావడం, తర్వాత ఆయన విడాకుల నోటీసు పంపడం, కోర్టులకు తిరగడం... అన్నీ రెండేళ్లలో జరిగిపోయాయి.

నేను మా వారిని బుజ్జగించాలని ఆ రెండేళ్లలో కాలంలో ఎంతో ప్రయత్నించా. ఆయన ఒప్పుకోలేదు. మా విడాకులు 2016లో చట్టబద్ధంగా జరిగిపోయాయి. పాప కూడా నా దగ్గరే ఉంటుంది. మా వారిని పూర్తిగా మర్చిపోలేకపోతున్నా. ఆయన దగ్గరగా ఉన్నప్పుడు మనసులు కలిసే ప్రయత్నం చేయలేదు. ఆయన దూరమయ్యాక చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. ఆ జ్ఞాపకాల నుంచి బయట పడక ముందే ఇంట్లోవాళ్లు రెండో పెళ్లి ప్రయత్నాలు చేస్తున్నారు. ఇప్పటి వరకు తప్పుడు నిర్ణయాలు తీసుకున్న నేను, ఇకపై తీసుకోకూడదను కుంటున్నా. మీరే సలహా ఇవ్వండి. నన్నేం చేయమంటారు? మళ్లీ నా భర్తని కలిసే అవకాశం వుందా?

జవాబు: నీ ప్రశ్నలోనే సగం సమాధానం ఉంది తల్లీ. మూడో వ్యక్తుల ప్రమేయం వల్ల సంసారాలు చెడిపోయే అవకాశాలు ఎక్కువగా ఉంటాయనే విషయం నేనెప్పుడూ చెప్తూనే ఉంటాను. గుర్తుందా? మీ ఆర్థిక పరిస్థితులు ఏమిటో నాకు తెలీవు. అలాగే నీ కాళ్ల మీద నువ్వు నిలబడగలిగే పరిస్థితి ఉందో లేదో నాకు తెలీదు. మీ ఆయన మీద నీకు ప్రేమ చచ్చిపోలేదు... అనిపిస్తోంది.



అతనిపట్ల మీ వాళ్లకున్న వ్యతిరేకత నీకు లేదు. ఏదో ఒకరోజు జరిగిన సంఘటనతో ఆవేశాలకు లోనై పోలీసు కేసై విడాకులదాకా తీసుకెళ్లారని పిస్తుంది. ఒకసారి మీ సంసారానికి సంబంధించిన పూర్తి వివరాలతో వచ్చి కలువు తల్లీ. ప్రయత్నం చేద్దాం.

ఒకసారి విడాకులైన భార్యాభర్తలు మళ్లీ కలవకూడదు అనే రూల్ ఏం లేదు. ■

## ఇంటర్‌లో ఏ గ్రూపు!?

యల్.కె - మంచిర్యాల్ జిల్లా

ప్రశ్న: మా పాప వయసు 15 సంవత్సరాలు. టెన్త్ క్లాస్ పరీక్షలు రాస్తోంది. మరీ గొప్పగా కాదు కానీ బాగానే చదువుతుంది. 70-80 శాతం మార్కులతో పాస్ అవుతూ ఉంటుంది. ప్రీ-ఫైనల్‌లో కూడా 82 శాతం వచ్చింది. కానీ టెన్షన్ అనుభవిస్తోంది. సైన్స్‌లో కావాల్సిన మార్కులు వస్తాయో, రావో; బైపిసిలో అడ్మిషన్ దొరుకుతుందో లేదోననే భయంతో వుంది. మా కుటుంబ పరిస్థితులకి, తన మనస్తత్వానికి పాప ఎలక్ట్రికల్ ఇంజినీర్ అవడం కరెక్ట్ అని మా నమ్మకం. డాక్టర్ అవాలని తన కోరిక. మా బావమరిది అమెరికాలో వుంటాడు. పాపకు చార్టెర్డ్ ఎకౌంటెన్సీ తగిన వృత్తి అని తన అభిప్రాయం. ఇంటర్‌లో ఏ గ్రూప్ తీసుకోవాలి? అనేది పెద్ద సమస్యగా తయారైంది. మా సమస్యకు పరిష్కారం చెప్తారా?

జవాబు: ఏ వృత్తిలోకెళ్లాలి? అనే నిర్ణయం తీసుకోవాల్సింది మీ ఛాయిస్ ప్రకారమో, మీ బావమరిది అభిరుచి ప్రకారమో కాదు అని నా అభిప్రాయం. ఆమెకు ఏ వృత్తి తగినది? ఎందులో అయితే బాగా రాణించగలుగుతుంది? తను కోరుకుంటున్న బై.పి.సి. గ్రూప్ డాక్టర్ వృత్తి తనకు ఎంతవరకు సరిపోతుంది? తన శక్తి, కృషి వున్న పట్టుదలనిబట్టి తను బైపిసికి తగినదేనా? అనే విషయాలు కనుక్కొని మీకు పాప విషయంలో ఒక పరిష్కారం సూచించడానికి నాకు 5-6 గంటల సమయం కావాలి. రెండు రోజులు వుండేలాగా పాపను తీసుకుని హైదరాబాద్ రండి. వచ్చేముందు ఫోన్‌లో అపాయింట్‌మెంట్ తీసుకుని రండి.

గుడ్ లక్. ■

# పద మథనం-107

- నిర్వహణ: వాడ్రేవు ఉమాశంకర్

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | | ■ | 5 | 6 |
| | ■ | 7 | | | ■ | | ■ | 8 | | |
| ■ | 9 | ■ | ■ | 10 | | ■ | 11 | ■ | | ■ |
| 12 | | | ■ | | ■ | 13 | | 14 | | |
| ■ | | ■ | 15 | | | | ■ | | ■ | ■ |
| 16 | | | ■ | ■ | ■ | | ■ | 17 | | 18 |
| | ■ | ■ | 19 | ■ | ■ | | ■ | | ■ | |
| 20 | 21 | | | | 22 | ■ | 23 | | 24 | ■ |
| 25 | | ■ | | ■ | 26 | | | ■ | | ■ |
| | ■ | 27 | | ■ | | ■ | 28 | 29 | | |
| 30 | | ■ | 31 | | | ■ | ■ | 32 | | ■ |

## ఆధారం

### అడ్డం

1. వసుంధర, పుడమి-3
3. పక్షిని బంధించే జైలు-4
5. పిండి కాదు మొరెం-2
7. అటు తెస్తే పంచదార తియ్యగా వుంటుంది-3
8. పంటకోసం తవ్విన నీటివాగు-3
10. మండూకము-2
12. ఈ చమురుకైనా చివరికి డబ్బు పెట్టవలసిందే-3
13. కోయిల తినే లేత మామిడాకు-5
15. కాణీ ఖర్చు లేకుండా తీర్పు ఇచ్చే గణపతి క్షేత్రం-4
16. కుమారుడు-3
17. చెడుగుడు-3
20. ఖాళీ చేతులు-6
23. తలా తోకా లేకుండా చేస్తే ఆలస్యం అయిపోతుంది-3
25. కావలి చివరికి నిద్రపోయాడు-2
26. షడ్రుచుల్లో ఏదీ కాని అదో రకం రుచి, అలాగే సువాసన కూడా-3
27. సంఘం, వ్యాపార నిర్వహణా కేంద్రం-2
28. మృత్యువు-4
30. అటు వెళ్లండి తేలు కుదుతుంది-2
31. సుడిలో దూకి ఎదురీదక... ఇదే సుఖమనుకోమంటాడు దేవదాసు-3
32. తిరగవేసిన ముగ్గు-2

### నిలువు

1. వ్యవహారంలో అసలుకంటే ఇదే ముద్దుట-2
2. ఖరీదు, రేటు-2
3. 5 మచ్చలున్న జాతి స్వేతాశ్వం-5
4. రక్షించేది, తావీదు-2
5. చంద్రునికో... దారంముక్క-4
6. మధ్యలో తుంచేసిన కలువ-2
9. మహాభారత సంగ్రామంలో పాండవుల్ని ఒక్కరోజు నిలువరించినవాడు-4
11. వావి-వరుస రెండెందుకూ మొదటిది చాలు-2
13. మాకు కావలసినది అందమైన మామిడిపండు-4
14. పక్షి చెప్పే జాతకం-5
16. నారికేళాలు-6
18. ఆ పిల్లవానికి చెడ్డీ మార్చండి-2
19. తలా తోకా లేకుండా, చిందర వందరగా వుండటం-5
21. వేదిక దిగిన వక్త తిరగబడ్డాడు-2
22. లుకలుకలు రెండే-4
23. చెదరిన ఆమని-3
24. ఉప్పు-4
29. దళసరి దుప్పటి-

## పద మథనం - 105 సరైన సమాధానాలు రాసినవారు

1. జి.ఎన్.వేంకటేశం-చిక్కడపల్లి 2. పి.రాజేశ్వరరావు-అలకాపురి 3. ఇ.శ్యామసుందర్, సి.రాజ లక్ష్మి, యస్.యస్.ఎగ్గోని-పుప్పాలగూడ 4. ఎస్‌టిపి కృష్ణమాచార్యులు-నాగోల్ 5. సి.సుబ్బారావు, సి.సరోజ, సి.ప్రవీణ్‌కుమార్, సి.పవన్‌కుమార్, సి.శ్రీసౌమ్య, సి.లక్ష్మీనరసింహమూర్తి-సనత్‌నగర్ 6. బి.కె.మూర్తి-హుజూర్‌నగర్ 7. ఉషశ్రీ-కొత్తపేట 8. ఎన్.సుభాష్‌చంద్రబోస్-విశాఖపట్నం 9.జి. కుమారస్వామి-పిడుగురాళ్ల 10. జి.నరేందర్ రాజ్-గోల్కొండ చౌరస్తా 11. వి.సుజాత-తిరుపతి 12. వి.వెంకటేశ్వర్లు-బేతవోలు 13. వి.కృష్ణమూర్తి-అద్దంకి 14. కె.శివాజిరెడ్డి, కె.లింగమ్మ-మాచర్ల 15. ఎ.సత్యనారాయణ బాబ్జీ, ఎ.సుమతి-నిజాంపేట రోడ్ 16. సి.గిరిజాశంకరరావు-డా॥ ఎ.ఎస్. రావునగర్ 17. ఎవిఎస్ ప్రసాద్-మోతినగర్ 18. కె.వి.సుబ్బారావు-గిద్దలూరు 19. వి.బి.టి. సుందరి-సరూర్‌నగర్ 20. ఎ.బాలసుబ్రహ్మణ్యం-కూకట్‌పల్లి 21. కె.లక్ష్మీకాంతమ్మ, రంగనాయ కమ్మ-అనంతపురం 22. జి.బలరామశాస్త్రి-మల్లాపూర్ 23. పి.శ్యామలా రాధాకృష్ణ-మదనపల్లి 24. బి.యాదగిరి-ఉప్పల్ 25. టి.వి.సూరయ్యనాయుడు, టి.కనకవల్లి-మల్లాపూర్ 26. కె.సుధా దేవి-చీరాల 27. వి.దుర్గావివేకానంద-పాత బోయినపల్లి 28. ఎస్.శ్రీనివాసరావు-ఎమ్మిగనూరు

## పద మథనం - 106 సమాధానాలు

పేరు: ______________________

ఊరు: ______________________

